భోసలశాహజభూవిభునిభాసిల్లుప్రేమనుపాలించువాసిగశోభన వైభవసంతతి ధీసంపదలిడుదేవునికి, శోభానే, శోభనమే.

Colophon : Nil.

S. జలక్రీడలు. గోపికలుగుంపులుకూడుకొనిజలక్రీడలాడుటకువచ్చితమ వలువలఁ దీసిగట్టుననుంచిస్నానముచేయుచుండ శ్రీకృష్ణుఁడువారికనుమొరఁగిచీరలెత్తుక పోయెను. అనంతరమువారలువీరలవేడవానినివారికొసంగివారిని శ్రీకృష్ణుఁడు పెండ్లాడెననుకథవర్ణితము.

R. సంపూర్ణము. వ్రాఁతచక్కనిది. తప్పులుఅంతిగాలేవు. శైథిల్యగ్రంథపాతములుగలవు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 522. | M. | 599 | $16\times1\frac{1}{4}$ | 27 | | సమగ్రము. |
| 523. | ,, | 600 | $19\times1$ | 20 | | ,, |
| 524. | ,, | 601 | $15\times1\frac{1}{4}$ | 9 | | అసమగ్రము. |
| 525. | ,, | 602 | $18\times1\frac{1}{2}$ | 12 | | ,, |
| 526. | ,, | 24 | $9\times5$ | 172 | దేవనాగరిలిపి. | సమగ్రము. |
| 527. | ,, | 25 | $9\frac{1}{2}\times4$ | 34 | ,, | ,, |

R. 522. ప్రతివ్రాసికొన్నయాతఁడిట్లు వ్రాయుచున్నాఁడు. "యీయలేఖమందు మొదటినాటకంకృష్ణలీలావిలాసం రెండోనాటకమైనయీజలక్రీడలనే నాటకం సంపూర్ణమగునట్టుగానువ్రాశినవరుంమ వెంకటరంగయ్య."

The scribe's name is Veṅkaṭaraṅgayya.

526-527. పలువిధంబులగుపాఠభేదంబులుగన్పట్టెడి.

These are Paper Manuscripts.

## 528. జీవనాటకము.

### JIVANĀṬAKAMU.

M. 703; S—16×1; L—41; Il.—3; G—492.

Beginning :

నాదనిమ్నతసత్వంనపావకోనోమరుత్......నగనం నచాపతే।
విశ్వవిలాసనాటకసాక్షిణే, సంవిదేవపరిశోవిజృంభతే॥
అన్నాడుగనుక.

జగదంకురకందాయ సచ్చిదానందరూపిణే ।
సమస్తజగదాధార మూర్తయేబ్రహ్మణేనమః ॥
అన్నాడుకనుకనిటువంటిసచ్చిదానందమూర్తివందనంబాచరించి.

* * *

అదృశ్యంబైనబ్రహ్మనాటకంబుప్రత్యక్షంబుగాతెలిసేటికొరకై మోక్షకాంతా కల్యాణంబనియెడి నామధేయంబున వేషభాషాదియుక్తముగ నాటకకథా క్రమంబెటువలెనంటేను.

End:

వివేకసమేతుండై సేనాధిపత్యంబునకభిషిక్తునింజేసి సకలపరివార సమేతుండై మాయాపురంబుమీాదయుద్ధార్థంబుగాచనిపురసమీాపంబున పురంబావరించి యున్న మాయాటవింజూచి దోవగానక కస్తిపడి గురుస్వామితోయేమను చున్నాండు.

Colophon: Nil.

S. జీవనాటకము. వేదాంతగ్రంథము. ముక్తికాంతనుజీవుండువివాహమగుట.

R. అసమగ్రము. వ్రాంతయొకతీరు. తప్పులుకుప్పలు. శైథిల్యముమెండు. గ్రంథ పాతమధికము. గ్రంథకర్తృనామతెలియదు. దీనికిజీవనాటకము, ముక్తి కాంతాకల్యాణము అనిరెండునామములుగలవు. ఇదియసమగ్రముగానుం డుట 557—558. నం॥ గ్రంథముల వేటొకప్రతియనినిర్ణయింప శక్యముగా కున్నది. ప్రతిపాద్యముమాత్రముతుల్యము.

This work, Jīvanātakamu otherwise known as Muktikāntākalyāṇamu is incomplete. It is rather difficult to determine its relation with Mss. Nos. 557 and 558. The author's name is unknown.

## 529. తంజాపురాన్నదానమహానాటకము.

(పురుషోత్తమదీక్షితుండు.)

TAÑJĀPURĀNNADĀNAMAHĀNĀṬAKAMU.

(Puruṣōttamadīkṣita.)

M. 684; S—17×1½; L—21; (256—277) ll.—7; G—588.

Beginning:

శుభమస్తు. కైవారం.

శ్రీరాజగోపాలకరుణాకటాక్షవీక్షాలబ్ధశాశ్వతైశ్వర్య, ఘోరావహాపరాభూత వీరవర్య, పాండ్యతుండీరమండలాఖండలఖండనోద్దండదోర్దండ, చండతర ప్రతాపమార్తండ, వీరాధివీర, వితరణకర్ణావతార, విజయరాఘవధీర, పరాకుస్వామీపరాకు.

* * *

విలాసినీజనమోహనరూపధేయుండవై, విజయరాఘవనామధేయుండవై వెల యునీవును, అనవరతశతలక్షవిప్రాభీష్టమృష్టాన్నప్రదాతలుగావున, సకలజన శ్లాఘాపాత్రంబగునీదుమహాసత్రంబునభుజియింపవేంజేసిన, * * తదీయారాధనంబునతిహర్షంబునపురుషోత్తమదీక్షితుండు విశిష్టదేశికాభీష్ట దేవతారూపుండైనశ్రీనివాసస్వామినినిజమానసనివాసునింజేసి, శృంగారహా స్యాద్భుతరసప్రధానంబుగా హావణించిన తంజావురాన్నదాన నామకమహా నాటకంబునకుకథాసంవిధానంబెటువలెను.

End:

వ॥ అనినవినిబోగాలవారుజోడుగూడినటించిరటయెటువలెను.

ద॥ పారులిరువురుసానిపడంతులతోగూడి, కూరిమినటించిరినేరుపుల్ మెరయ.

Colophon:

భరతవాక్యం॥

ఇవ్విధంబునననవరతలక్షబ్రహ్మాన్నదానదాతయగుమన్నారుదాసన్నృపాలునకు హేమాబ్జనాయికారాజగోపాలకులుఆయురారోగ్యంబులమితభోగ భాగ్యం బులుసంతానసమృద్ధియుసామ్రాజ్యాభివృద్ధియుసకలదిగ్విజయంబునుబాలించి లాలించిరక్షింతురుగాత, మన్నారుదేవికిమంగళం సత్ర మరులు నాటకము సంపూర్ణము.

S. తంజావురాన్నదాననాటకము.

K. సమగ్రము. వ్రాతయుందమైనదే. తప్పులులేవు. శైథిల్యగ్రంథపాతములులేవు. గ్రంథమందచ్చటచ్చటపాత్రలసంభాషణయందఅవముగూడవాడఁబడె. దీనికి సత్రమరులని నామాంతమురము.

This work is also called 'Satramarul.'

# 530–534. త్యాగరాజవినోదచిత్రప్రబంధ నాటకము.

(శాహమహారాజు.)

TYĀGARĀJAVINŌDACITRAPRABANDHANĀṬAKAMU.

(Śāha Mahārāja.)

M. 572; S—$16\frac{1}{2}\times1\frac{1}{4}$; L—109; ll.—4; G—1744.

Beginning:

ఏవంకవినాట్యారంభేఇష్టదేవతాప్రార్థనంకరోమి. చూర్ణిక॥ ఇహాఖలుచరాచరవందితపాదారవిందే. * * *

సూత్ర॥ అపురాయీవిధంబునపగతనుకొనియాడిత్యాగవినోదచిత్ర ప్రబంధంబునందు సరసనకలవిద్యాపారంగతసకలభాషాభిజ్ఞమదుకుచిత్ర విస్తారకవితానిర్వాహకవిద్వాంసులకు కర్ణరసాయనంబుగా త్యాగేశనామాంకితవిద్యాసుధావారిధిజనితసంగీతసాహిత్యతరంగంబులలోయథోచితంబుగా తోఁచిన అణుమాత్రంబుగాకవివిస్తరించను, నిష్కపటులాతప్పులుదిద్ది విననాధరించరయ్యా.

R. ఇయ్యది సంస్కృతము, తెలుగు, మహారాష్ట్రీయము అనుమూఁడుభాషలతో వ్రాయఁబడిన నాటకము. ఆయాపాత్రలీ మూడుభాషలనుగూడ నుపయోగించును. ఏపాత్ర యేసందర్భమున, నేభాషను వ్యవహరించుననువిషయము నిర్ణయించుటకుశక్యముగాకున్నది. దీననాఅంకములుగలవు. ఆయంకముల నచ్చటచ్చట తెలుగువ్యవహరింపఁబడియె. సంస్కృతబహుళంబుగానుండుటచే సంస్కృతనాటక సమాఖ్యకుఁదగియున్నది. తెనుఁగునకుగూడ నిద్దానప్రవేశ ముంటదీనఁబ్రసక్తికలిగినది.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 531. | M. | 573 | $16\times1\frac{1}{4}$ | 190 | సమగ్రము. |
| 532. | ,, | 574 | $15\times1$ | 36 | అసమగ్రము. |
| 533. | ,, | 575 | $21\times1$ | 26 | ,, |
| 534. | ,, | 576 | $21\frac{1}{4}\times1$ | 27 | ,, |

R. వీనిలో పెక్కు పాఠభేదములుగాననగు.

Most of the characters are made to speak in Sanskrit while the rest speak either Telugu or Mahrāṭhi.

## 535–538. ద్రౌపదీకల్యాణము. (శాహమహారాజు.)

DRAUPADIKALYĀṆAMU. (Śāha Mahārāja.)

M. 551; S—19×1¾; L—29; Il.—3; G—348.

Beginning:

తోడ్యం॥ జయపార్వతీరమణ జయమనోభవహరణ జయభుజంగాభరణ జయ లోకశరణ. * * *

జయజగదేకమహీతలేశ్వరతనూజ, జయజయోదారభోసలశాహరాజ.

End:

సూ॥ వ॥ అపురాయీవిధంబునవచ్చినవ్యాసులకు యెదురొక్కొనివందనమాచరించి వుచితాసనంబునకూర్చుండ నెమించియావ్యాసులజూచి ద్రుపదభూపాలుండు పలికేమార్గం.

క॥ వరమునిసందోహవరం, దరధరమీకెరగసట్టిధర్మముకలదె
వెరవేమికన్యకువేగుయు, పెరుముటలుఅనిపలికెకుంతిపెద్దకుమారుండు.

సూ॥ వ॥ అపురాయీవిధంబునపలికినద్రుపదునివాక్యంబు.

Colophon: Nil.

S. ద్రౌపదీకల్యాణము.

R. అసమగ్రము. వ్రాతచక్కనిదే. తప్పులతడక. శైథిల్యములేకపోలేదు. గ్రంథపాతములుగలవు. ఈగ్రంథమునకంతిములేదు. 537 గ్రంథమునకంత్యభాగము గాననయ్యెడి. అదియిట్లు:—"సూ॥ యీవిధంబునపలికినవ్యాసులవచన ప్రకారంబుగ, ద్రుపదరాజుపంచపాండవులకువివాహంబుజేయుసమయంబున సకలజనులు సంతసమందిమంగళంబులుపాడ్డేక్రమం." 537 ప్రతితుదిని ప్రతి విలేఖకుఁడిట్లు వ్రాసికొనియున్నాఁడు:—"శ్రీహరిశ్చంద్ర మహారాజువారి నగరిగ్రంథంసుబ్బయ్యభాగోతులచేతివ్రాలు." ఈప్రతిలోని మొదటిగ్రంథము తెలుగుకాదు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 536. | M. | 550 | 14×1 | 22 | శిథిలము. ఆద్యంతరహితము. |
| 537. | „ | 688-a | 16×1⅜ | 12 | పాఠభేదములు పెక్కు. అసమగ్రము. |
| 538. | „ | 639-a. | 10×1 | 48 | సమగ్రము. |

*This Ms. does not contain the concluding portion, whereas No. 537 does not contain the beginning of the work.*

---

## 539. పంచకన్యాపరిణయము. (బాలకవి.)

PAÑCAKANYĀPARIṆAYAMU. (Bāla Kavi)

M. 679; S—17×1; L—32; Il.—3; G—384.

Beginning:

శ్రీరామచంద్రాయనమః.

శ్రీమంగళాకారశ్రీ.

సహ్యజయును, గలిగివిలసిల్లుసకలలోకములు మెచ్చ, మహిమచెన్నొందగను చోళమండలంబు.

వ॥ తద్దేశంబులోన సకలజనాధారంబై రంజిల్లు తంజాపురంబును మంజుళంబుగ బాలించుయేకభూపాలునికుమారుండై నశాహామహారాజ దేవేంద్రుండొక్క నాడు శుభదినంబునసకల వైభవంబులు మెరయ సమాత్యభృత్యహితపురోహితకవీశ్వరగాయకవైణికనటవికట ముఖ్యజనంబులుపరివేష్టించి కొలువపేరోలగంబుననుండిననుంజూచియేమనుచున్నాండు.

ద్విపద॥ మొదలసుదాహుండుమురవైరితోడ, కదిసికందుకమాడ గానోడిమరుదినంబునగెలిచెదననివచ్చుటయును, యంబుజాక్షుండువానియభిలాషదీర్చ కదలిరాగాపంచకన్యకామణులు, యెదురైనచూచిమోహించివారుంను భవనముదెలియపాపనియొక్కనిచి, సవరణమీరతాచనుదెంచియోసు దామునిగాంచితద్దయువారిచెల్వు, వేమరువానితోవివరించుటయును యబ్బాలుండటుబోయియాగృహంబరసి,నిబ్బరంబురంబునవచ్చినీరజాక్షునకు దెలుపసుదామునిదిక్కువీక్షించి, పలికెవెన్నుండువారిపైతనమనసు

నిలిచె కావున నేడెనీ నేర్పు మెరయ, జలజాక్షులకు నాకు సంభోగ మొనర
జేయుమనుటయు మచ్చికవల్లెనతఁడు, నాయానతినిబూనియు బ్బాలు వెంట
తగబోయి చెలులను ద్యానవ. . .ని, కెగువనున్న కోలంకు కే తేరవారి
సకిచేత కార్యంబు జతగూర్చి వచ్చి, ప్రకటంబుగా రమాపతికి దెల్పుటయు
నంతనందరు గోల్వనట కేగిసఖుల, నంతంతనిలిపి తానంబు జాకరము
చెంతకు బోయియా స్త్రీల చేలములు, నంతయు గోనివారలడుగ వచ్చినను
బెదరించి పెండ్లాడిపిద పొకరాకరు, కదనమాడుచు నుండగా మాన్పివారి
నతిశయంబున కృష్ణుఁడలరించెన నెడి, కతము మించిన పంచకన్యల పెండ్లి
బాలకవీంద్రాంధ్ర భాష చేసీవు, చెలిమిగను పట్టి మెరయనీ వేళ
మాకు. . .ంబుగా మంజు నాటకము, వేడుకతో రచియింపు సుకవీంద్రులెన్న.

End:

వ॥ అవురాయి వ్విధంబున మవ్వంబు. . .రహావణించిన పంచకన్యా పరిణయంబను
నాటకంబునకధీశ్వరుండైన శాహామహారాజ దేవేంద్రునికి యిలు వేలుపయిన
శంకరుండు. . . . . . . .నిత్యాయు రారోగ్య భాగ్యంబుల బాలించి రక్షించుగాతా.
శ్రీరామచంద్రాని వేగతి.

Colophon: Nil.

S. పంచకన్యాపరిణయము. శ్రీకృష్ణుఁడు పంచకన్యలను వివాహమాడుట.

R. సంపూర్ణము. వ్రాఁతమంచిది. తప్పులుగలవు. శైథిల్యము మెండు. గ్రంథపాత
ములు గలవు. ఆదిపత్రమర్ధాధికము వినష్టము. కవినామము గన్పట్టదు. కాని
యిందు బాలకవీంద్రాయని కృతిపతి చేసిన సంబోధన మొండు గాననగు. అయ్యది
బిరుదము వలెగన్పట్టు.

This work, Pañcakanyāpariṇayamu relates the marriage of Śri Kṛṣṇa and five Kanyās or girls. It is doubtful whether the term 'Bāla Kavi' found in the work, represents the name of the author or his title.

## 540. పంచరత్నప్రబంధము. (శాహామహారాజు.)

PAÑCARATNAPRABANḌHAMU. (Śāhamahārāja.)

M. 685; S—17×1; L—38; ll.—5; G—760.

**Beginning :**

జయరమాపురవాసజయచంద్రికాహాస, జయసుమేరుశరాసజయకృత్తివాస.

* * *

సర్వగుణభరితసకలభాషాచతుర్విధసాహితీనిర్వాహకుండగును, దీపాంబాగర్భశుక్తిముక్తాఫలంబగు, శ్రీశాహవసుంధరాపురందరుండురచియించినపంచరత్నప్రబంధంబునందుతొలుతవిఘ్నేశ్వరప్రార్థనచేయఁగావిఘ్నేశ్వరుఁడువచ్చేమార్గం ॥ దరువు. ॥

**End :**

ద్విపద॥ శ్రీకంధరునిపేరసితదేహుపేర, లోకనాయకుపేరరుద్రునిపేర
పురుహూతనుతుపేరపురహరుపేర, కరుణాంబునిధిపేరగౌరీశుపేర

* * *

సాహితీపుంభావశారదయైన, శాహభూపాకశాసనుఁడురచించ
సరసనత్కృవులెల్లసన్నుతిచేయ, ధరణిలోనాచంద్రతారార్కముగను.

**Colophon :** Nil.

సూ॥ ఇత్తెరంగునఉదారవేషభాషాభూషితంబగుశ్రీశాహమహారాజప్రణీతంబైన పంచరత్న ప్రబంధంబునందు రసికజనమనోహరమైసకలకవికర్ణభూషణమైరాణించుమహాప్రబంధంబుత్యాగేశ్వరప్రీతికరమైవిలసిల్లుగాక.

S. పంచరత్నప్రబంధము. నటశిఖామణియగునీశ్వరునియెదుటబిరుదుమిటారులు తమనాట్యవిద్యాకౌశలమునుజూపుటవారుబహుమానములఁజేయుటయునిటులనేనవసిద్ధజోగి, చెంచు, బిరుదుబంటులనువారలుతమతమగాన, నాట్య, అభినయాదివిద్యలకౌశలమునుజూపుటయింనువర్ణితము.

R. సమగ్రము.వ్రాఁతయందమైనదే.తప్పులుగలవు.శైథిల్యగ్రంథపాతములున్నవి. తుదినిట్లున్నది :—

" వ్రాలాశభఘ్రులుతప్పులు, చాలాగలవేనుశబ్దసంగతులెరుగక
నేలింబెట్టకనవ్వక, పోలంగాజూడరయ్యబుధజనులారా.
నట్టువగట్టుసింహునివ్రాలు నట్టువచక్రవర్తివ్రాసిన రామాయణచూళాది సంపూర్ణము."

## 541. ప్రహ్లాదచరిత్రము. (విజయరాఘవనృపాల.)

## PRAHLĀDACARITRAMU. (Vijayarāghava.)

M. 692; S—17×1½; L—17; ll.—5-6; G—350.

Beginning:

శ్రీపాండరాజగోపాలవిలాసనా, టకముసందర్భించుసుకవివంద్య
మధురోక్తులను చెంగమలవల్లిపరిణయం, బానతిచ్చినప్రతిభానిధాన
కోవిదుల్ గొనియాడగోవర్ధనోద్ధర, ణమురచించినకల్పనాధురీణ
రతిమన్మథవిలాసకృతిరాజ మొనరించి, పరగు ప్రాబంధికపట్టభద్ర
భువినిరాసక్రీడనవనీతచోరంబు, హవణించి వెలయుమహానుభావ
చాతురిచేపారిజాతాపహరణంబు, రచనచేసినమృదువచనధుర్య
ఘనమైనరుక్మిణీకల్యాణమనుకృతి, నిర్వహించినబుధసార్వభౌమ
వరుస రాధామాధవవివాదముధనాభి, రామంబొనర్చుసర్వజ్ఞతిలక
పాండిత్యమునసత్యభామావివాహవ, ర్ణ సయొనర్చినకవిరాజరాజ
ప్రాజ్ఞులౌననుపాపరిణయనాటకం, బమర జేసిన శారదావతార
దక్షిణద్వారకాస్థలవర్ణనాభాగ, ముద్ధరించినసుప్రసిద్ధచరిత
మహిమచే కాళియమర్దనంబొనరించు, సరిలేనిరాజులచక్రవర్తి
ధరరఘునాథాభ్యుదయమునాటకముగా, ద్విపదగారచియించుధీరవర్య
అలమోహినీవిలాసాఖ్యద్విపదకృతి, నాటకంబొనరించుసలసమాన
అతిపవిత్రంబుప్రహ్లాదచరిత్రంబు, సవరించుఘనమనీషాధురీణ
హరువునపూతనాహరణంబనెడునాట, కంబొనరించుశృంగారలోల
తగుమంజరీద్విపదప్రబంధమునాట, కంబుగాహవణించుగానచతుర
విప్రనారాయణవిద్వత్కథాసంవి, ధానంబొనర్చినధీనిధాన
బుధులుమెచ్చసముద్రమథననాటకరాజ, మొనరించుభువనమోహనచరిత్ర
లలితమౌకృష్ణవిలాసనాటకమణి, సల్పినయష్టభాషాధురీణ

రసికులుప్రణుతింపప్రణయకలహమను, కృతియొనర్చినచమత్కృతిధురీణ
అతులితప్రౌఢిచేనలకంసవిజయంబు, ఘటియించుభువనవిఖ్యాతశీల
ఘనమైనజానకీకల్యాణనాటకం, బమరించువాపదూకాగ్రగణ్య
నవపుణ్యకవ్రతనాటకవైఖరి, సేకరించినవాగ్విశేష శేష
కేళిమైగోపికాగీతలుభ్రమరగీ, తలుతెనింగించునద్యతనభోజ
సరిలేనిఫాల్గుణోత్సవమెల్లరగడచౌ, పదములొనర్చినభవ్యచరిత
ధరరాజగోపాలదండకసందర్భ, వైదర్భిగన్నవిద్వత్కవీంద్ర
సారమహావీరశృంగారసాంగత్యంబు, మెరయించురసికులమేలుబంతి
సంపంగిమన్నారుసాంగత్యమునమర్చి, జగతినెచ్చిననెరజాణరాయ
గోపాలునకువేండుకోలువిన్నపములు, దరువులొనర్చునౌదార్యధుర్య
మెలలువీడిపదాల్ హెచ్చుసంకీర్తన, లధ్యాత్మలొనరించునతులచర్య
వాల్విచిగుజ్జరివిల్వోడుదండులా, స్వముకంతుకక్రీడయల్లికయును
కొరవంజిశుభలీలగుజరాతిదేశిచౌ, పదముజక్కిణిదురుపదముమదన
బదదూత్యమునుజోగిపదచాళిశారదా, సామ్రాజ్యమునుచిందునవతిమచ్చ
రంబులునాట్యకదంబుమొదలైన, నాట్యముల్ హావణించునవరసజ్ఞ

తే॥ మహితగాంభీర్యచోళసామ్రాజ్యధుర్య, కోటిమన్మథరూపసద్గుణకలాప
విక్రమకుమారరఘునాథవిభుకుమార,ధ్రువముగామన్నువిజయరాఘవనృపాల.
పరాకుస్వామివారుహావణించినప్రహ్లాదకథానాటకంబు నటనపటిమగనుపించ
వినుపించేమువిననవధరించుండ.

* * *

వ॥ అని యిష్టదేవతా ప్రార్థనంబుగావించి నాటక చాటుకావ్యంబు నిర్వహింప
బూనినవిజయరాఘవసార్వభౌముండయ్యాదిమదంపతులకు నేమనివిన్నవింపు
చున్నాడు. * * *
సఫలంబుగానాటకచాటుకావ్యరీతివర్ణించెదనాకర్ణింపరయ్యా.

వ॥ అనివిన్నవించివిజయరాఘవధాత్రీకళత్రుండుహావణించినప్రహ్లాదచరిత్రంబునకు
కథాక్రమంబెటువలెనూ.

**End:**

మన్నారుదేవికిమంగళం ॥ వ ॥ ఇవ్విధంబునప్రహ్లాదునకు త్రైలోక్యసామ్రాజ్య సింహాసనంబుపాలించిన నృసింహస్వామి అచ్యుతవిజయరాఘవభూపాలునకు ఆయురారోగ్య అయిశ్వర్యాభివృద్ధిన్ని ధనకనకవస్తువాహనసమృద్ధిన్ని అఖండ భూమండలాధిపత్యమున్ను కలుగజేసిరక్షించుగాత.

**Colophon:** Nil.

S. ప్రహ్లాదచరిత్రము.

R. సంపూర్ణము. వ్రాలుచక్కనివి. తప్పులు లేకపోలేదు. శైథిల్యముస్వల్పము. గ్రంథపాతముసూపట్టెడి. దీన 14-వ పత్రముకొంతభాగముమాత్రముకను పట్టుచున్నది. విశేషములుదాహృతగ్రంథమువలనంజెలియునది.

This work is Prahlādacaritramu from the pen of Vijayarāghava Nāyak who ruled Tanjore from 1633 to 1673 A. D. The various works of this author are enumerated here; most of which are unfortunately lost to us.

## 542. పాండవాజ్ఞాతవాసము.

PĀṆḌAVĀJÑĀTAVĀSAMU.

M. 702; S—16×1½; L—32; Il.—8-9; G—1280.

**Beginning:**

...నికంబుఅశ్వమేధ పర్వమాశ్రమవాసంబుభాసురమగు, మౌసలంబను పర్వంబుమజ్జియునందుకలదుమహాప్రస్థానికాఖ్యనొకటి, యాథికెక్కెను స్వర్గయారోహణంబు, అనియాతీరునమెన్నదగినపదునెనిమిదిపర్వములను, విదితంబై వెలసెలోకవిఖ్యాతంబై.

* * *

ఆదౌపాండవధార్తరాష్ట్రజననంలాక్షాగృహేదాహనం
ద్యూతశ్రీహరణంవనేవిహరణంమత్స్యాలయేవర్తనమ్ ।
లీలాగోగ్రహణంరణేవతరణంసంధిక్రియాజృంభణం
పశ్చాద్భీష్మసుయోధనాదిమరణంహ్యేతన్మహాభారతమ్ ॥

*

అని ఆతీరునధర్మజుండు సన్న్యాసియై మచ్ఛమేదినీశ్వరునికొలువుకుయేవిధాన వచ్చెనూ.

ద॥ పొంకమైనభూతిపుండ్రాముబెట్టి, కొంకకనొకదంటికోలచేపట్టి, సంకోచమున రాజుసముఖానకువచ్చె, కంకుభట్టుపేరుగలిగిధర్మజుడు.

End :

క॥ పదిదినములై దుర్ప్రొద్దులు, పదపడిరెన్నాళ్లువొక్కపవలుఁగేయుఁ కదనంబుసేసిమడిసిరి, నదిసుతగురుకర్ణశల్యనాగపురీశుల్.

వ॥ అనియీవిధానపాండవులుసకలబలములనున్నువాతము సేసి భూభారనివారణ కర్తయైనటువంటిశ్రీకృష్ణస్వామికటాక్షము చేతహస్తినాపురమందు ధర్మప్రకారమునధర్మరాజుతమ్ములసహాయమునరాజ్యముపరిపాలన సేయుచున్న సుఖాన వుండెను.

Colophon : Nil.

S. పాండవాజ్ఞాతవాసము.

R. సమగ్రముగాదు. వ్రాఁతయొకతీరుది. తప్పులుగలవు. శైథిల్యముచూపట్టు. గ్రంథపాతముగలదు. ఈగ్రంథాదిస్వల్పముగానష్టమాయెననితోఁచెడి. ప్రతి పాద్యమునుబట్టిగ్రంథనామము నిర్దేశింపఁబడెను. ఈగ్రంథాంతముననిట్లున్నది.

క॥ "అచ్చుగయీకథచదివిన, మచ్చికతోవిన్నయట్టిమనుజులకెల్లఁ నిచ్చలుసీతారమణుడు, యిచ్చునుకల్యాణతతులుయిమ్మహిలోనఁ."

ఈప్రతియొక్కముఖపత్రమున "విరాట్పురుషనాటకఁ" అనియున్నది.

The Ms. is incomplete. The author is not traceable.

## 543. పారిజాతాపహరణము. (మాతృభూతకవి.)

### PĀRIJĀTĀPAHARAṆAMU. (Mātṛbhūta Kavi.)

M. 506 ; S—16×1½ ; L—108 ; ll.—6 ; G—2592.

Beginning :

జయజగత్పరిపాల, జయరుక్మిణీలోల, జయమధురవాగ్జాల, జయకృపావాల జయఘనాఘననీలజయసురామరసాల, జయదళితశిశుపాలజయగోపాల

* * *

ప్రకటమహామద్గురుస్వామినిదలచి, గురుతరశాండిల్యగోత్రపావనుఁడ
వరకవిరంగార్యవరతనూభవుఁడ, గురుకృపాసౌగంధికుంతళాదేవి
వరముచేజనియించిప్రబలినవాఁడ, మాతృభూతస్వామిమహితకటాక్ష
చాతుర్యపరిలబ్ధసరససాహిత్య, సంగీతమధురవాగ్ఝరిగల్గువాఁడ
శృంగారరసముఁదెలిసినమేలువాఁడ, కవిమాతృభూతనాఖ్యానంబుచేత
భువిలోపలప్రసిద్ధిఁగొందినవాఁడ, గరిమచేలోకవిఖ్యాంతబుగాను
సరవిమీరగపారిజాతాపహరణ, మనుమహానాటకంబందరుమెచ్చ
వినుపింత్తుత్రైలోక్యవిఖ్యాతముగను.

వ॥ అని * * * కృతిపతినభివర్ణించెద నెటువలెనూ.

ద్వి॥ శ్రీభోసలకులాబ్ధిశీతాంశుఁడనగ, ప్రాభవంబందినపరమపుణ్యుండు
శ్రీకరమ్మై...లునుభాసిలుచోళరాజ్య, మేకచక్రంబుగానేలెడువాండు
మకరందముఖ్యసమంచితబిరుదు, లకలంకముగబూనియమరినవాండు
పోలుపైనశ్రీతంజపుటభేదనమను, తెలిదీవికినివిష్ణుదేవుడౌవాఁడు
* * *
నిరతంబుతుళుజావనీమహీపాలునికి, కరమొప్పపౌత్రుఁడై కడగినవాఁడు
మరియుఁప్రతాపసింహక్షితీంద్రునికి, సారిదినిసుపుత్రుఁడై శోభిల్లువాఁడు
వ్యక్తమైలెగుఁయమునాంబికాగర్భ, శుక్తిమాక్తికముగాసొంపొందువాఁడు
సారజ్ఞుఁడౌతుళుజావనీంద్రునికి, కూరిమియనుజుఁడై కొమరొందువాఁడు
* * *
రహిచంద్రమాళీశ్వరప్రసాదంబు, బహుళంబుగాగల్గిభాసిల్లువాఁడు
* * *
యింతటియమరసింహేంద్రుఁడౌనృపతి, చెంతకాయుకయుండుశివరాయమంత్రి
* * *
రమణకెక్కినకృష్ణరాయులచెంత, విమలుఁడైయప్పాజివెలసినరీతి
* * *
విహితధర్మముచేతవెలసిశంభాజి, రాయునితనయుఁడైరాష్ట్రింబునందు
నాయతకీర్తిచేనమరినవాండు, * * *

అలత్రియంబకమంత్రికనుజుఁడౌ వాఁడు, కలితనాగోజికంకరులకగ్రజుఁడు
యెలమినీయమరసింహేంద్రునిసభను, నలుగురు మెచ్చంగననుబిలుపించి
యాచంద్రతారార్కమౌనట్టుగాను * * *
భవ్యమైతగుగద్యపద్యాత్మకముగ, నలపారిజాతాపహరణంబుముద్దు.

End:

వ॥ అనిగోపస్త్రీలుమ్రొక్కిరటయెటువలెనూ.

గుమ్మకాంభోది. ఆది.

చేరిమ్రొక్కిరిగోపాలాంగనలు చేరిమ్రొక్కిరి,
చేరిమ్రొక్కిరిసిగ్గుచేతకనులఁ మూసుక
సారెత్రిశిరగిరీశుసఖుఁడైనశ్రీహరికి, మొనగుబ్బలుకరహారబాహువుమూల
రుచులఁపొదలకనకపుపల్లెములనగత,
తవనునవిలుతుదివాణములుతెలియగాచేరి.

వ॥ ఇట్లుమ్రొక్కినసమయంబున గోపాలమూర్తిగోపస్త్రీసర్వాంగదర్శన సంజాత కుతూహలుండై చీరలొసంగినధరియించుకొనిసంతుష్టాంతరంగలై గోపస్త్రీలు స్వామినిపరివేష్టించుకొనియేమనికొనియాడుచున్నారు.

శ్లో॥ తవకథామృతంతప్తజీవనం, కవిభిరీడితంకల్మషాపహమ్।
శ్రవణమంగళం శ్రీమదాతతంభువిగృణంతియేభూరిదాజనాః.
అంగనామంగనా దేవకీనందనః.

Colophon:

గద్య॥ ఇదిశ్రీచోళసింహాసనాధ్యక్షభోసలప్రతాపసింహరాజపూర్వపుణ్యపరిపాక స్వరూపయమునాంబికాగర్భ శుక్తిమౌక్తికాయమానామరసింహ మండలాధీశ్వరనామాంకితంబైనమంత్రిమార్తాండశివరాయమంత్రికారితంబైన శ్రీమత్సుగంధికుంతలేశ్వరకరుణాకటాక్షవీక్షణసుధాసారసంజనితచతుర్విధకవితానిర్వాహకశాండిల్యగోత్రపవిత్రకవి రంగయార్యపుత్ర విద్వజ్జనవిధేయమాత్రభూతకవినామధేయప్రణీతంబైనపారిజాతాపహరణనాటకమందు * *
* * సర్వంబునుపంచమాంకము.

S. పారిజాతాపహరణనాటకము. 1—5 అంకములు.

R. సంపూర్ణము. వ్రాతయొకతీరు. తప్పులుకొద్ది. శైథిల్యగ్రంథపాతములులేవు.

Matṛbhūta Kavi is the son of Raṅgayūrya. This work contains five acts.

## 544. పారిజాతాపహారము.

### PĀRIJĀTĀPAHĀRAMU.

B. 10298-b; S—$9\frac{1}{10}\times1\frac{1}{5}$; L—19; (21–40)ll.—6–7; G—150.

Beginning:

పారిజాతాపహారాఖ్యంనాటకమభినీయతే.

*　　　*　　　*

వ॥ అవురాఈవిధంబునఅంతటశ్రీపారిజాతనాటకనాట్యవైఖరికివిఘ్నంబుగాకుండు విఘ్నేశ్వరుండువచ్చేమార్గంబుపరాకు.

దరువు॥ వచ్చెనేగణపతిదిగోచాలవరదుడై మిగులనువన్నెమీరగను.

End:

సవితీనాతోనీకుచలమేభామ, భావించిచూడవేభాగ్యమెప్పరిదిం
అవనీమండలచంద్రుడఖిలపాలకుడు, శివనారాయణతీర్థసేవితాధిపుడు

వ॥ అంతటనీలాగునరుక్మిణిఅమ్మవారుచేతసత్యభామఅవమానంబుపొంది తనయింటికివచ్చికోపాగారమందుప్రవేశించేటపుడుయేమనిప్రలాపిస్తూన్నది.

దరువు॥ ఏమిసేతునేఓయమ్మాబంగారుబొమ్మముద్దులగుమ్మా.

Colophon: Nil.

S. పారిజాతాపహారనాటకం.

R. అసమగ్రము. వ్రాంతిచక్కనిది. గ్రంథపాతశైథిల్యములుగానగును. "శివనారాయణతీర్థసేవితాధిపుడు" అనుదానివలన "శివనారాయణతీర్థు"లుగ్రంథకర్తలగునుగా. దీనమతికొన్నిగ్రంథములుగానగు. గ్రంథలిపిలోనున్నది.

The Ms. is incomplete. The author is not traceable.

## 545–553. పార్వతీపరిణయము. (శాహమహారాజు.)

### PĀRVATĪPARIṆAYAMU. (Sāhamahārāja.)

M. 508; S—$15\times1\frac{1}{4}$; L—44; ll.—4–5; G—884.

**Beginning :**

జయపార్వతీరమణ, జయమనోభవహరణ, జయభుజంగాభరణ, జయలోక శరణా.

* * *

సూత్రధారి॥ వ ॥ అవురా ఈవిధంబునమరిన్నే విధానవం టేను,

సీ॥ సకలవిద్యావిలాసములచేరంజిల్లు, శాహభూపాలునిసన్నుతించి
అతనిసభాసీమనమరుధీరులచతు, ర్వేదవేదాంతాదివిదులపొగడి
అందునానందించుఅనవద్యసాహిత్య, నరులమహాకవీశ్వరుల వేడి
సంగీతభరతశాస్త్రకళాధురీణుల, నేర్పులమదినెంచియేర్పరించి

తే॥ ఆమహారాజుపరమేశ్వరాంకితముగ, పరగచేసినపార్వతీపరిణయాఖ్య
మనెడునాటకమూరాజుననుమతమున, వేషభాషాదియుతముగావిస్తరింతు.

వ॥ అన్నండుగనక, అవురాయీవిధంబున అభీష్టదేవతావందనంబుగావించిసభా నాయకాదులనుఅభివర్ణించిశ్రీశాహమహారాజప్రణీతంబైన పార్వతీకల్యాణం బనియెడు నాటకంబు, కథాసంవిధానంబుగా వినుపించెదము వినసవధరించ రయ్యా, కథాసంవిధానం.

**End :**

సూ॥ ఈవిధంబునబ్రహ్మేంద్రాదిదేవతలుపార్వతీపరమేశ్వరులవివాహమహో త్సవంబుశాయంగా ఆసమయంబున గంధర్వకిన్నరకింపురుషులు పుష్పవర్షం బులువర్షించియీ మహోత్సవంబునతుంబురనారదాదులు మంగళంబులు శోభనంబులుపాడేమార్గంపరాకు. * * *
మహేంద్రశాహరాజాయమంగళంనిత్యమహితకల్యాణమంగళం

* * * *

శ్రీచోళనాయకాయశ్రీవాసుదేవకవివచస్సంతుష్టాయమంగళం.

**Colophon :** Nil.

S. పార్వతీకల్యాణము.

R. సంపూర్ణము. వ్రాతమంచిదే. తప్పులుగలవు. శైథిల్యముగలదు. గ్రంథపా తముంజూపట్టు. గ్రంథాంతమునసిట్లున్నది. "ఈయలేఖమందు మొదటినా

టకంవిఘ్నేశ్వరుండు, రెండవదినరస్వతి, మూడోదిపార్వతీకల్యాణంసంపూర్ణ మగునట్లుగాను వ్రాశినవరుండు లేఖరి వెంకటరంగయ్య." మూడు నాటకము లిందులేవు. పార్వతీపరిణయనాటకముఒక్కటిగానంబడు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 546. | M. | 504 | 19½×1 | 28 | | అసమగ్రము. |
| 547. | ,, | 505 | 15×1¼ | 50 | | ,, |
| 548. | ,, | 507 | 19½×1 | 28 | | సమగ్రము. |
| 549. | ,, | 509 | 18×1 | 44 | | ,, |
| 550. | ,, | 13 | 9¼×4 | 60 | దేవనాగరిలిపి | ,, |
| 551. | ,, | 14 | 9½×5 | 120 | ,, | ,, |
| 552. | ,, | 15 | 8×4 | 72 | ,, | ,, |
| 553. | ,, | 16 | 10×5 | 62 | ,, | ,, |

పాఠభేదములుపెక్కుగలవు.

R. 550–553. These are Paper Manuscripts.

## 554. పూతనాహరణము. (విజయరాఘవభూపాల.)

## PŪTANĀHARAṆAMU. (Vijayarāghava Bhūpāla.)

M. 677; S—17×1½; L—16; ll.—6; G—348.

Beginning:

శుభమస్తు. శ్రీరామచంద్రాయనమః

సీ॥ భోజకన్యాముఖాంభోజరాజమరాళ, సత్యాఘనస్తనస్తబకభృంగ
జాంబవతీలోచనచకోరశశాంక, మిత్రవిందాతటిన్మేఘరూప
భద్రావశావశాభద్రదంతావళ, వరసుదంతామనోవనమృగేంద్ర
లక్షణారూపకలాపిపర్జన్య, భానుసుతాలతాపారిజాత
తే॥ షోడశస్త్రీసహస్రచక్షుఃప్రసార, హారసారమసారమోహనశరీర
విజయరాఘవభూపాలభజనలోల, కేలుమోడ్చెదరాజగోపాలనీకు.

పరాకుస్వామి.

శ్రీరాజగోపాలచరణారవిందభజనానందసాంద్రరఘునాథనాయకరత్నరత్నా కరావతీర్ణసంపూర్ణపూర్ణిమాచంద్ర, పాండ్యతుండీరాదివైరివీరగజకంఠీరవ

కిశోర, కళావత్యంబికాకుమార, చంద్రోపేంద్రసురేంద్రనందనకందర్పకోటి సౌందర్యధుర్య జీర్ణకర్ణాటక సామ్రాజ్యసింహాసనస్థాపనాచార్య సమసమయ సమాచరితసమ స్తనిస్తులతులా పురుషాదిమహాదానాపదాన ప్రవర్తితకీర్తి ధారేయ, సంగరరంగగాంగేయ, ప్రతిదినబ్రాహ్మణసహస్రాభీష్టమృష్టాన్న దాన దీక్షాధురీణ, మానినీనూతనపంచాబాణ, విశ్వవిశ్వంభరాభారభరణవిచక్షణదక్షిణభుజాదండ, శౌర్యశైశ్వర్యధైర్యధర్యమేరుకోదండ, దక్షిణసింహాసనపట్టభద్ర, కలియుగరామభద్ర, చతుర్విధకవితానిర్వాహకసార్వభౌమ బిరుదాంగదవిరాజమానచరణాంభోజ, కవిసమాజభోజజనకచరణరాజీవసేవావిధాయక, విజయరాఘవనాయక, పరాకుస్వామివారుహావణించినపూతనాహరణ నాటకంబునటనపటిమగనుపించవినుపించేముచూడనవధరించుండ.

End :

వ॥ ఇవ్విధంబుననానందంబుజెందినయానంద నందనునిపై దివ్యదుందుభిఘోషంబుతో మందారపుష్పవృష్టిగురిసెనట యొటువలెను.

వ॥ ఇవ్విధంబునకుమారునకుశుభాచారంబులునడపించినయుత్సాహ బాహుళ్యంబున యశోదరంగమధ్యంబున మంగళప్రదము గానటించెనట యొటువలెనూ, మన్నారుదేవికిమంగళం.

Colophon :

భరతవాక్యము.

ఇవ్విధంబునపూతనాభంజనంబుసేసిన, సనాతనదేవతాచక్రవర్తి, రాజగోపాలమూర్తి, అచ్యుత విజయరాఘవేంద్రునకాచంద్రార్కంబుగావిశ్వవిశ్వంభరాధిపత్యనిత్యాయురారోగ్యభాగ్యంబులుపాలించిరక్షించుగాత పూతనాహరణనాటకంసంపూర్ణము.

S. పూతనాహరణము. శ్రీకృష్ణుడుపూతనయనురక్కసినిబరిమార్చుట.

R. సమగ్రము. వ్రాలుగుండ్రన. తప్పులులేవు. శైథిల్యగ్రంథపాతములులేవు.

## 555. బాలకృష్ణలీలావిలాసము. (అక్కనామాత్యశేఖరుఁడు.)

• BĀLAKṚṢṆALĪLĀVILĀSAMU. (Akkanāmātya.)

M. 597; S—8×1½; L—44; ll.—5; G—400.

Beginning:

ద్విపద॥ శ్రీరమ్యమగుచుఁవాసికివన్నె కెక్క, ద్వారకాపురమేలుదానవారాతి
వికసితవదనారవిందుఁడై వేడ్క, నొకనాఁడుమనముననుత్సాహమొదవి
తనరెడిస్త్రీలలోధర్మపత్నిన, వనితరుక్మిణీదివ్యవరమందిరమున
కరుదెంచిశ్రీకృష్ణుఁడతిసంభ్రమున, తరళాయతాక్షికితగవరములొసగి.

* * *

ఉ॥ నల్లనిమేనివానిచిరునవ్వుఘటించెడుమోమువానిశో
భిల్లెడుకాంతివానిశిఖిపింఛముచేనమరుస్నవానిరా
జిల్లెడువేణువానిసరసీరుహనేత్రములొప్పువానివి
మొల్లసుగంధులారనవమోహనుఁడైనకృపాలుచూపరే.

ద్విపద॥ కనకాంబరముకటిగట్టినవాఁడు, ఘనముగాఘననీలకాయంబువాఁడు

* * * *

యెక్కడెక్కడవసియించియున్నాఁడో, గ్రక్కునచూపవేకమలాయతాక్షి.

వ॥ అనినవిని సెచ్చెలులిట్లనిరిక్కొమ్మా శ్రీకృష్ణదేవునియింతగావర్ణించెదవునీవెవ్వరు,
శ్రీకృష్ణుండునీకేమిగావలయు, మీతల్లిదండ్రులెవ్వరు అత్తమామలెవ్వరు,
వివరించితెలుపవలయుననిసెచ్చెలులతోసత్యయిట్లనియె.

End:

మంగళం॥ మంగళముమంగళముమాధవునకు, * *
గోపాలకృష్ణునకుకుందరదనునకు, శ్రీపతికిఆసతికిచెలువవెంకటపతికి

ద్వి॥ అనియిట్లుసకలలోకాధీశుపేర, * * *
విరివిగామాయిష్టవేలుపుపేర, అంకితంబుగవెంకటాధీశచరణ
పంకజవిశ్వాసపరుఁడుశోభితుఁడు, సలలితవనజాతసంభవశ్రేష్ఠ.

Colophon:

కులుఁడుభారద్వాజగోత్రసంయుతుడు, సరసవైఖరిమెరయుసత్కీర్తియుతుడు
సరబాదలింగోజిసత్పుత్రుఁడక్క, నామాత్యశేఖరుండతిసంభ్రమమున

కాముని గన్న చక్కని బాలకృష్ణ, లీలావిలాసలాలితనాటకంబు
భూలోకమునశుభంబులపొల్పుకూర, సరలితో భరతశాస్త్రప్రవీణతను
పరగగకన్నులపండువుగాగ, ఆచతుర్ముఖనిర్మితావనియందు
నాచంద్రతారార్కమైయొప్పుగాత.

S. బాలకృష్ణలీలావిలాసము.

R. సంపూర్ణము. వ్రాలుచక్కనివి. తప్పులు లేకపోలేదు. శైథిల్యముస్వల్పము.
గ్రంథపాతముగలదు. గ్రంథాదినిదేవతాప్రార్థనముగన్పట్టుటలేదు. ఏకాంత
భాగమయినను లుప్తమాయెనేమో తెలియుటకవకాశముకన్పట్టదు.

"ప్రమోదూతనామసంవత్సరశ్రావణ బ ౨ లు మద్దాలివల్లభుండువ్రాశి
నాడు" ఇట్లుగ్రంథముతుదినిగలదు.

Akkanāmātya of Bhāradvājagōtra is the son of Sarabāda Lingōji.

The scribe's name is Maddāli Vallabha.

## 556. * మన్నారుదాసవిలాసము. (రంగాజమ్మ.)

MANNĀRUDĀSAVILĀSAMU. (Rangājamma)

556 M. 705 $16\frac{1}{2}\times1\frac{1}{2}$ 51 అసమగ్రము.

## 557–558. ముక్తికాంతాపరిణయము.

(పరమానందతీర్థయతి.)

MUKTIKĀNTĀPARIṆAYAMU. (Paramānandatīrthayati.)

M. 637 ; S—16×1 ; L—36 ; ll—3 ; G—216.

Beginning :

శ్రీమచ్చిదాకారుశివయోగసారు, కామాదిభయదూరుకలుషవిదారు
విమలగుణస్తోమువిశ్వార్వభౌము, కమనీయనిజధాముకల్యాణనాము
పరగసంతుముగేయుపావనధ్యేయు, పరగదత్తాత్రేయుభక్తవిధేయు
తలచికీర్తించివందనమాచరించి, అలరుచుతగపరమానందతీర్థ

యతినామధేయుఁడాయత మోదమునను, చతురత్రప్రౌఢిచేసజ్జనుల్ పొగడ
కరమొప్పముక్తికాంతావివాహ, మరుదారపదచాళికమరజెప్పెదను.

*　　　*　　　*

End :

॥ గురుతరమహాద్రికూటాగ్రజమున, పరగెకుమందిరప్రకటస్థలమున
నాడిస్తనద్వయనాసాగ్రమునఁ, జోడుగరవిచేసిజోతులువెలుగ
ఆమునర్చిమయమైనప్రమిదువు, ప్రేమాస్పదుచేతిపీఠమునంగ
చెలువొందుచువివేకజీవుకుమూర్తి, లలనామణినిగూడిలక్ష్యంబమర్చ
తన్నుతానెరుగకతనువుమరచి, చిన్మయస్థితిగాంచశీఘ్రమునవపుడు.

Colophon :

ఫలస్తుతి॥ అనుచుఁగీర్తిదత్తాత్రేయమౌని, ఘనతపదపద్మకలితభృంగమున
అతులితముగపరమానందతీర్థ, యతినామధేయుఁడాయత మోదమునను
చతురత్రప్రౌఢిచేసజ్జనుల్ పొగడ, కరమొప్పముక్తికాంతాపరిణయము
అరుదారభూమినెవ్వరతిభక్తివిన్న, యెవ్వరుపాడిన......స్థంబు
యివ్వసుంధరలోనయెల్లచేకూరు.

S. ముక్తికాంతాపరిణయము. వేదాంతగ్రంథము. జీవుడు ముక్తికాంతను పెండ్లి యాడుటప్రతిపాదింపఁబడును.

R. సమగ్రము. వ్రాఁతయొకతీరు. తప్పులధికములు. శైథిల్యములేదు. గ్రంథపాతముగలదు. దీనివేఱొకముక్తికాంతాపరిణయమసమగ్రముగానున్నది.

This is a philosophical drama entitled Muktikāntāpariṇayamu in which the Puruṣa or the individual soul takes Mukti or salvation for his bride. The author is Paramānandatīrthayati.

558. M. 638 26 సమగ్రము.

## 559–560. రఘునాథాభ్యుదయము.

(విజయరాఘవనాయకుఁడు.)

RAGHUNĀTHĀBHYUDAYAMU. (Vijayarāghava Nāyak.)

M. 687 ; S—17×1⅓ ; L—26 ; II—6 ; G—624.

Beginning :

శుభమస్తు.

సీ॥ భోజకన్యాముఖాంభోజరాజమరాళ, సత్యాఘన స్తన స్తబకభృంగ
జాంబవతీవిలోచనచకోరశశాంక, మిత్రవిందాలటిస్మేఘరూప
భద్రవశా..............., సుహంతావరిమనోమృగేంద్ర
లక్షణారూపకలావినిపన్నన్న, ఘానసుతాలతాపారిజాత
తే॥ షోడశస్త్రీసహస్రచక్షుఃపసార. హారసారిమసారిమోహాంశరీర
విజయరాఘవభ.........ల, కేలుమోడ్చినరాజగోపాలసింహ.

* * *

వ॥ ఇవ్విధంబునవచ్చిన విజయరాఘవపట్టభద్రుండు భద్రసింహాసనాసీనుండైన
* * * సరగునతాతియాచార్యులువచ్చె.

వ॥ ఇవ్విధంబున వచ్చినయాచార్యులచరణారవిందంబులకు వందనంబు గావించి
అతనియర్ఘ్యాసనంబుననుంచితానున్నగూర్చున్నక్రమమెటువలెను.

వ॥ ఆసమయంబున విజయరాఘవసార్వభౌముండునాటి యరుణోదయావసరం
బునగాంచినస్వప్నవృత్తాంతంబుచింతించి ఆచార్యులనీక్షించి వర్షాసమయ౦ం
భూతనవాంభోధరగంభీరస్వరనిగుంభనవిజృంభణంబుతోనేమనుచున్నాండు.

ద్వి॥ అలఘుతపోధుర్యయాచార్యవర్య, కలగంటివినవయ్యకల్యాణశీల
నిన్నరేయొకవింతసీటుమీరంగ, కన్నెపాయమువాండుకందర్ప...
* * * , యొకచెల్వగోల్వనాయొద్దకువచ్చి
విజయరాఘవవత్సవినుముమామాట, భజియింపుచునుమమ్ముప్రతివత్సరంబు
* * * , ఫలకమోహనచిత్రరూప
విధముగైకొనిమేమువేడ్కతోనిలిచి, యాగర్భమందునీవావిర్భవింప
* * * , * * పురాణ
దంపతులమునీకుతల్లిదండ్రులము, విరవాదితావులువెలసినరీతి
సరసవాక్యంబులసరణులుమీర, పదములుమంజరీప్రముఖకావ్యములు
మొదలమాకంకితంబులుసేసితీవు, * * *
ధీచతురాననద్విపదకావ్యంబు, నీచేతనందుకోనేమువచ్చితిమి
* * * , రఘునాథమేదినీరమణునిచర్య

ధీకౌశలముమించద్విపదగావించి, మాకంకితముసేసిమనుమువేయేండ్లు
*    *    *    , ననుగటాక్షించియంతర్హితుండయ్యె.

వ॥ అనివిన్నవింప  *  *  జూచిఆచార్యులేమనుచున్నారు.

ద్వి॥ భుజవిక్రమాధారభోజావతార, విజయరాఘవధీరవీరాధివీర
వినవయ్యమీవంశవృత్తాంతమెల్ల, వినుపింతునీకుసవిస్తరఫణితి
వనజాక్షుపదములవరలువాహినికి, ననుజన్మయైమించునాలవజాతిజగతి
నాజాతిలోఁచాలనధికులైనట్టి, రాజులుగొందరుప్రఖ్యాతిగనిరి
వారిలోఁగృష్ణభూవరుఁడులావణ్య, కారుణ్యగుణములఘనకీర్తిఁగాంచె
అమ్మహామహునకునాత్మజుండైన, తిమ్మభూపాలుండుధీరతవెలసె
బయ్యాంబికవరించిప్రౌఢివహించె, నయ్యిరువురుగాంచిరాత్మసంభవుల
పెదచెన్నభూపాలుచినచెన్నవిభుని, పెదమల్లభూజానిపినమల్లనృపతి
వారిలోఁచినచెన్నవసుధాతలారి, మేరుధీరుఁడనంగమేదినివెలసె
చిరతరంబుగభక్తశ్రీశైలమందు, .........దాచలంబులనను
శంకరార్పణముగాశాశ్వతానేక, కైంకర్యములుచేసిఘనకీర్తిగాంచె
సుగుణసంతతికినచ్యుతరాయనతికి, తగినసోదరికృశోద......ంబ
సూత్రనికిభార్యయైయఖిలభూపాల, సతులలోనార్యయైసన్నుతిగాంచె
అచ్యుతేంద్రుఁడువారికాత్మజుండగుచు, అచ్యుతుండితఁడేయనిజను.
......మునకుశ్రీరంగంబునందు, బంగారుసజ్జలుప్రాకారములును
రంగమీరకిరీటరాజంబుమేలి, శృంగారవనములుచెలువొంద...
......న్నిలయమ్ముఁగదిసి,    *    *    *
ప్రతివచ్చుమూర్తమాంబనువరియించె, కోసల్యదేశ......మణుండు
వాసిమీరంగరఘూద్వహుఁగన్నరీతి,
అలమూర్తమాంబయునచ్యుతేంద్రుండు
. నలనిభునిరఘునాథనరనాథుగనిరి, రసికుఁడాయచ్యుతరఘునాథవిభుఁడు
వసుమతిరాజ్యనిర్వాహకుండగుచు, తుండీరవీరునిందురములోదరిమె
*    *    *    , మన్నారుమీయయ్యమాయవతార
మన్నమాటయథార్థ...నవినుము, ఆయవతారవిహారంబుకన్న

సీయవతారమందిదిగ దావింత, * * *
ఆరఘునాథనాయకశిరోమణికి, నారీలలామమైనారాయణునకు
పట్టపురాణియాపాలముస్నీట,.........యావరమకల్యాణి
* * * , ప్రణుతిగ్గ కొనివెంపరాజచంద్రునకు
బరగులక్ష్మాంబకుబట్టియైపుట్టి, పరమపతివ్రతా............
లావణ్యవతికికళావతీసతిక్, ఆవిర్భవించినీవభివృద్ధిజెందు
విజయరాఘవనామవిఖ్యాతిగాంచి, నిజభుజంబునభూమినిర్వహించితివి
* * *
తారహారముగమీాతండ్రిచారిత్ర, మారయాషిద్విపదకావ్యము సేయమయ్య
* * * , గుణశీలునకురాజగోపాలునకును
అంకితంబుగమనోహరవచోరచన, లంకరింపగ నేనుహావణింపబూను
నవ్యమారఘునాథనాయకాభ్యుదయ, కావ్యంబునకుకథాక్రమ మెట్టిదనిన.

End:

వ॥ అని యుపచరించిన రమణీమణికేలుగీలించి రఘునాథభూపాలుండు కేలిభవ నంబుప్రవేశించి, పంచశర కళాప్రపంచంబెరింగించి యమ్మెరుంగుబోణినికరం గించియచ్చటముచ్చటదీరసమ్మోచ్చెకంటినిపంచవింటిదొరతనంబునకుగురిసేసి యేలుచునిజలీలావిలాస శృంగాటకంబుగా నాటకంబుహావణించిన తనముద్దు బట్టియగు విజయరాఘవపట్టభద్రునకుసామ్రాజ్యపట్టంబుగట్టి, అతండుగా వించువివిధోపచారంబులకుహార్షింపుచునమరులు పుష్పవర్షంబు వర్షింపశుభో దర్కంబుగానటించెనటయెటువలెను.

మన్నారుదేవికిమంగళం. రఘునాథాభ్యుదయంసంపూర్ణం.

Colophon: Nil.

S. రఘునాథాభ్యుదయము. రఘునాథనాయకునివిజయములువర్ణితములు.

R. సంపూర్ణము. వ్రాతచక్కనిది. తప్పులులేకపోలేదు. శైథిల్యముకలదు. గ్రంథ పాతములులేవు. కొంతభాగముమూషికభక్షితము. రఘునాథనాయకుని కుమారుండేయీగ్రంథకర్త. కృతిపతి రాజమన్నారు. ద్విపదగరచింపుమని నట్లుగ్రంథమునఁగలదు. కానిమధ్యవచనములు దరువులుమొదలగునవిగలవు. ఇయ్యది నాటకము.

The poet describes here the history of his father, the famous Raghunātha Nāyak who ruled Tanjore from 1614 A.D. to 1633 A.D.

560. M. 19 9×4 50 నాగరిలిపి. సమగ్రము.

This is a Paper Manuscript.

## 561–567. రతీకల్యాణము. (శాహమహారాజు.)

RATIKALYĀṆAMU. (Śāha Mahārāja.)

M. 537; S—21×1; L—28; ll.—4; G—448.

Beginning:

జయదేవిశార్వాణిజయవినుతగీర్వాణి, జయకీరవరవాణిజయమృదులపాణి
జయశుభగుణశ్రేణిజయగౌరికల్యాణి, జయవిభవనిశ్రేణిజయఘనాశ్రోణి.

* * *

సూ॥ ఈరీతినినాంద్యారంభమందు ఇష్టదేవతావందనంబుగావించిసభానాయకుని అభివర్ణించి శ్రీశాహమహారాజప్రణీతంబైన రతీకల్యాణనాటకం కథాక్రమం బుగావినుపించేమువినవధరించరయ్యా.

End:

సూ॥ ఈవిధంబున సకలదేవతలువచ్చినతరువాతనువివాహాశ్రయంగా మంగళం పాడేమార్గం ॥ మంగళం ॥ గౌరికిరమ్యవిహారిణికి, సారకృపారసహారిణికి, మీరినప్రేమనుధీరులబ్రోచుచుకోరికలొసగెడుగుణనిధికి, దేవునికిమహాదేవునికి, దేవాధిపనుతభావునికి, శ్రీవైభవములుతగపావనుండైతగుసేవకనిధియగు శివునికిని, భోసలశాహజిభూవిభుని, భాసిలుప్రేమనుపాలించు, వాసిగశోభనవైభవసంతతిధీసంపదలిడుదేవునికి, శోభానె, శోభనమె.

Colophon: Nil.

S. రతీకల్యాణము. రతీమన్మథులవివాహము.

R. సంపూర్ణము. వ్రాంతచక్కనిది. తప్పులుకుప్పలు. శైథిల్యముగలదు. గ్రంథ పాతముగన్పట్టు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 562. | M. | 538 | $17\frac{1}{2}\times1\frac{1}{4}$ | 35 | | సమగ్రము. |
| 563. | ,, | 539 | $16\times1\frac{1}{2}$ | 29 | | ,, |
| 564. | ,, | 540 | $16\times1\frac{1}{4}$ | 13 | | ,, |
| 565. | ,, | 541 | $15\times1\frac{1}{4}$ | 56 | | ,, |
| 566. | ,, | 28 | $9\times5$ | 65 | నాగరిలిపి. | ,, |
| 567. | ,, | 34 | $17\times1\frac{1}{3}$ | 37 | పాఠభేదములుగస్పట్టు. | ,, |

R. 563. ప్రతితుదినిట్లున్నది. "బూయ లేఖముసందు యెనిమిదవనాటకంబైనరతీ మన్మథవివాహంబనెడునాటకంసంపూర్ణమగునట్లు లేఖరి వెంకటరంగయ్యచేతి వ్రాలు." ఈప్రతిలో వేఱొకనాటకంబేదియునగపడదు. పాఠభేదమధికము.

564. "విజయగోపాలునిచేతివ్రాలు" అని తుదినిగలదు.

566. Colophon : ఇతి శ్రీమద్భోసలకులశాహామహారాజవిరచిత రతీమన్మథ విలాస మహానాటకంసకలవిద్వజ్జనప్రీతిగానసకలశ్రేయసే శ్రీత్యాగేశసాంబ సదాశివశ్రీపూర్ణానందార్పణమస్తు.

No. 563. The scribe's name is Venkaṭaraṅgayya.

No. 566. This is a Paper Manuscript.

## 568–569. రాజకన్యాపరిణయము. (గిరిరాజు.)

RĀJAKANYĀPARIṆAYAMU. (Girirāja.)

M. 544 ; S—19×1¾ ; L—18 ; Il.—3 ; G—216.

Beginning :

శ్రీకరంబైనరాజశేఖరుండైన, గోకేంద్రసుతుఁడు శాహేంద్రుఁడువింత
సారిరాఁగాఁజూచిసఖనిదాఁగూడి, యారాజకన్యకఅలరిమోహించి
వచ్చుటయునుసఖియువచ్చుటముదము, హెచ్చుకన్యకుదాదికెలమిభాషణము
దనరంగయాకన్యతలితండ్రులపుడు, మునుకొనివచ్చుటముద్దుతనూజ
వితమెల్లదాదిచేవినిహరుషించి, సుతనుశాహేంద్రుకుసారిదినిచ్చుటయు
అన్నవవితములనమరినరాజ, కన్యాపరిణయంబుఘనతతోడుతను
గరిమనుగిరిరాజకవిరచించె, ధరణిలోనాచంద్రతారార్కమైపొగడ.

End:

మంగళం॥ మహారాజశాహేంద్రునికిమంగళం, మిగుల మహనీయశీలునికిమంగళం ॥ పల్లవి ॥ వనధిగంభీరునికి, వనజలోచనునికి మనసిజరూపునికిమంగళం, తంజాపురీంద్రునికితరుణీపాంచాలునికిమంజులభాషణునికిమంగళం, వాసవనిభునికివరసాహిత్యభోజునికి మహారాజేంద్రునికిమంగళం.

Colophon: Nil.

S. రాజకన్యాపరిణయము. శాహరాజు వాహ్యాళివెడలంగా నొకరాజకన్యవానిం జూచి మోహించుటయునామెయొక్కయభిప్రాయమును దల్లిదండ్రులెఱింగి యామెను శాహేంద్రునికిచ్చివివాహంబు సేయుటయునిందువర్ణితము.

R. సమగ్రము. వ్రాతమంచిదే. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములులేవు.

The story of the love-marriage between Śāha Mahārāja and a royal girl is described here.

569. M. 542 15×1¾ 15 శైథిల్యముమెండు. సమగ్రము.

## 570. రాజమోహనకొరవంజి. (గిరిరాజు.)

### RĀJAMOHANAKORAVAÑJI. (Girirāja.)

M. 645-a 16×1½ 8. అసమగ్రము.

R. ఇది 509—511 నెంబర్లతో సమానము.

This work is same as Nos. 509–511.

---

## 571. రామనాటకము.

### RĀMANĀṬAKAMU.

B. 11539-e; S—$17\frac{3}{10}\times1\frac{3}{10}$; L—6 (1-6); ll.—6; G—115.

Beginning:

విశ్వామిత్రవేషం.

ద్వి॥ వినవోయిదశరథవిపులాధిపేంద్ర, ననయుద్దామగణితసద్గుణసాంద్రరవికులంబునబుట్టురాజశేఖరులువివరులుచాలనభీష్టదాయకులుమెన్ననీసంతతులయేపునువిననునంతోసమామెనుసారెకునిలను.

**End:**

వరుసతో డుత స్వయంవరముచూడగ అరుదెంచిహరువిల్లు అవలీలద్రుంచి యెల్లరాజులుసన్నుతింపంగ రాముడల్లుడాయెనుధన్యుడైతివిపుడు.

**Colophon:** Nil.

S. రామకథ. నాటకము. ఏకదేశము.

R. అసమగ్రము. వ్రాతమంచిదే. తప్పులుగలవు. గ్రంథపాతశైథిల్యములున్నవి. ఇదిగ్రంథలిపిలోనున్నగ్రంథము.

The Ms. is incomplete and the author is not known.

## 572–577. రామపట్టాభిషేకము. (శాహమహారాజు.)

RĀMAPAṬṬĀBHIṢEKAMU. (Śāha Mahārāja.)

M. 581; S—15½×1⅞; L—25; ll.—4; G—300.

**Beginning:**

జయదశరథపుత్రజయ రామసుచరిత్ర జయదివ్యనుతిపాత్రజయజగన్మిత్రజయ జయ జయశుభావహగాత్రి, జయజగత్కృతిసూత్ర జయ భానుశశినేత్ర జయజయా.

*　　　*　　　*

సూ॥ అపురాయీవిధంబున అభీష్టదేవతానందనంబుగావించి సభానాయకాదుల నభివర్ణించి శ్రీశాహమహారాజప్రణీతంబైన రామపట్టాభిషేకమనెడునాటకం బుకథాక్రమముగావినవిపించేమువినసవదరించరయ్యా.

**End:**

సూ॥ వ॥ అపురాయివ్విధంబున యీదేవేంద్రాదిదేవతలు యీరామస్వామిని కనకసభయందు నవరత్నఖచితసింహాసనంబున కూర్చుండనియమించి సకల మైనతీర్థములచేతపట్టాభిషేకంబు సేయుసమయంబున, నారదకిన్నరకింపురు షులు, మంగళంబు పాడేమార్గంబుపరాకు. మారామభద్రునికిమంగాళం, మాసీతాదేవికిమంగాళం, వనజాతనేత్రునికి. శ్రీశాహమహీపాలదేవునికిమం గళం.

Colophon :

శ్రీవెలయంగనాశ్రితరక్షకుండు, భావజాకారుండుపరమపుణ్యుండు
భోసలకులసింధుపూర్ణచంద్రుండు, శ్రీశాహభూపాలశేఖరుండిపుడు
శ్రీరామపట్టాభిషేకనాటకము, కోరిగావించెనెక్కుడభక్తిమీర
నెవ్వరుచదివిననెవ్వరువిన్న, నెవ్వరాడిననుమరియెవరుచదివినను
ధనధాన్యములుతరుచైనసుతులు, ఘనమైనసంపదల్ కరిరథాశ్వములు
అరుదైనభక్తినానతిశోభనములు, గరుడవాహనుడిచ్చుగరిమమీరగను
ధరణిలోనాచంద్రతారార్కముగను.

S. రామపట్టాభిషేకము.

R. సమగ్రము. తప్పులుగలవు. వ్రాతమంచిది. శైథిల్యముగలదు. గ్రంథపాతముం గన్పట్టు. విశేషములకుదాహృతిమరయునది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 573. | M. | 582 | $17\frac{1}{2}\times1$ | 24 | | సమగ్రము. |
| 574. | ,, | 580 | $15\times1\frac{1}{4}$ | 27 | | ,, |
| 575. | ,, | 583 | $14\times1$ | 15 | | అసమగ్రము. |
| 576. | ,, | 29 | $9\frac{3}{4}\times4$ | 35 | దేవనాగరిలిపి. | సమగ్రము. |
| 577. | ,, | 30 | $9\times5$ | 124 | ,, | ,, |

R. 577. ఈప్రతిచివరనిట్లుగలదు. "తారణనామసంవత్సరే భాద్రపదమాసేకృష్ణ పక్షేఏకదశ్యాంసౌమ్యవాసరే తంజాపుర్యాంచేళువబాండాస్థానే ప్రసన్నా సంతశ్రీనివాసముఖ్యదత్తేలేఖనం ప్రతాపరాయోపనామ్నా [illegible] దేవసుతవిఠ్ఠలేనలిఖితం."

No. 577. The scribe's name is Vittal and the date of transcription is Wednesday the eleventh day of the dark fortnight of the Bhādrapada month in the year Tāraṇa.

Nos. 576, 577. These are Paper Manuscripts.

## 578. రుక్మాంగదచరిత్రము.

### RUKMĀṄGADACARITRAMU.

M. 655 : S—$19\frac{1}{2}\times1\frac{1}{2}$ : L—31 : (1—31) Il.—6 : G—375.

Beginning:

శ్రీగణాధిపతయేనమః. రాగం ఉశాని. తాళం శా.

వచ్చెమరద్వతిఇదుగో యెన్న ముసటగాతనమగని చెంతకును
పలుచని మోకెంజిగురుదీనితెముత చెక్కులుఅద్దములనైనకోరి
వెలయు మోముముద్దుగాగువచ్చెలలనయిదుగో చాలరసికతమీరారు.

End:

ద్వి॥ ధరలోనరుక్మాంగదచరితంబుమిగుల, గరిమనుపఠించుఘనులైనవారు.

* * *

వేడుకెంతో గల్కి వివరంబుగల్గి, చిరకాలముగచిరసంజీవిగాయిలలో
వరుసతో వెలయుదురువన్నెమీరగను, మంగళంమంగళంనిత్యమంగళం.

Colophon: Nil.

S. రుక్మాంగదచరిత్రము.

R. సమగ్రము. వ్రాలుచక్కనివి. తప్పులుగలవు. గ్రంథపాతముగానరాదు. శైథిల్యముస్వల్పము. గ్రంథాంతమున "వరదరాజస్వామిసహాయం ఇందనాటకపుస్తకంశుప్పయెడిదినది" అనియున్నది. మరికొన్ని సంస్కృతపుస్తకములు గూడఁదీనగలవు.

The author is not known.

## 579. రుక్మాంగదచరిత్రము.

RUKMĀṄGADACARITRAMU.

M. 704; S—15×1½; L—30; H.—4; G—480.

Beginning:

ఉ॥ తుండమునేకదంతమునుగణాధిపనీకుమ్రొక్కెదన్.

* * *

సూ॥ వ॥ అపురాయీవిధంబునసభానాయకాదులనభివర్ణించిన యాతదనంతరంబునరుక్మాంగదచరిత్రయను నెడునాటకంబునందుకథాసంగ్రహంబువినుపించేము విననవధరించరయ్యా.

**End:**

వినవె మోహనాంగి, చాలాసంతోషమాయెనునీకున్నతగతులుకల్పించెము.

విష్ణు॥ క॥ ముదమునద్వాదశిదినమున, నిదిరించినవారిపుణ్యనేమములోనన్

సుదతీమణివినునీకును, పదియూరిటనొక్కపాలుప్రాపించునుమీా.

సూ॥ వ॥ అప్పురాయీావిధంబున మహావిష్ణుమోహినికివరమిచ్చినకార్యాత్రనారదకి

న్నరకింపురుషులుమంగళంబులు పాడేమార్గం.

Colophon: Nil.

S. రుక్మాంగద చరిత్రనాటకము.

R. సమగ్రము. వ్రాతయొకతీరు. తప్పులుగలవు. శైథిల్యముమెండు. గ్రంథపాత ములులేవు. గ్రంథాదినిసూచీపత్రముకలదు. కవితెలియదు. గ్రంథాదినిట్లు న్నది. "ప్రభవనామసంవత్సర ఆశ్వయుజశుద్ధవిజయదశమినాడుకాటయిపురు షోత్తమయకుమారుడుచేవందిలింగంవ్రాసినయేకాదశీవ్రతం రుక్మాంగదచరిత్ర యక్షగానంపుస్తకము గోపాలార్పణమస్తు. తుదినిట్లున్నది." "వెంకటాచలం రుక్మాంగదచరిత్రయెత్తినవాండుయిచ్చేది."

This work is Rukmāṅgadacaritramu by another author, whose name is also not known. The scribe's name is Cevandiliṅgam.

---

## 580–581. రుక్మాంగదచరిత్రము.

RUKMĀṄGADACARITRAMU.

M. 196-a; S—18×1¼; L—69; Il.—5; G—1380.

**Beginning:**

శుభమస్తు. అవిఘ్నమస్తు.

సీ॥ గండస్థలంబులకనుపట్టుమదధార, లందుతుమ్మెదపింజుసందడింప

* * *

వ॥ ఈలాగున సకలయిష్టదేవతాప్రార్థనగావించి నేడువినుపించె రుక్మాంగదచరిత్ర యనెనాటకంబునకుకథాసంవిధానంబెలాగుననంటెను,

End :

శా॥ ఆవైకుంఠపురంబునందుసురకన్యారత్నముల్ గొల్వగా
జీవాస్తాన్వయుఁడంగనాసహితుఁడై శ్రీవిష్ణుపాదాబ్జసం
సేవామానసనిశ్చలస్థితికివచ్చెన్ దివ్యహార్మ్యంబులన్
శ్రీవిఖ్యాతిసమగ్రవైభవములన్ చిత్తంబు మోదింపగన్.

Colophon : Nil.

S. రుక్మాంగదునికథ. నాటకము.

R. సమగ్రము. వ్రాఁతయొకవిధము. తప్పులుగలవు. శైథిల్యముమిక్కుటము. గ్రంథపాతములులేవు. కవినామముగానరాదు. ఇందితరగ్రంథములందలి పద్యములుసమయానుకూలముగాఁగూర్పఁబడినవి. (End) తుదిభాగముమాత్రము నెం. 581 ప్రతినిపోలియున్నది. తుదినిట్లున్నది. "ప్రసంగిరంగప్పరచన."

ద్వితీయపత్రమున నిట్లున్నది. "రుక్మాంగదచరిత్రనాటకప్రసంగ్గిగజశింహ్వుండువ్రాశినఆకులు ౭౭". ప్రస్తుతము 69 ఆకులుగన్పట్టుచున్నవి

This work is Rukmāṅgadacaritramu of unknown authorship. The ending of this work seems to be the same as No. 581. Scribes' names are Prasaṅgi Raṅgappa and Gajasimha.

581. M. 200 20×1 62 అసమగ్రము.

## 582. రుక్మాంగదము.

### RUKMĀṄGADAMU.

M. 42 ; S—16½×1½ ; L—6 ; Il.—5 ; G—120.

Beginning :

క॥ శ్రీతువ్వముసామికృపన్, ప్రాకటనాటకనిరూఢిపదరససంద
ర్భాకృతిరుక్మాంగదుకథ, శ్రీకరముగనాటకంబుసేయుదుగరిమన్.

ద్వి॥ శ్రీకరంబైయొప్పుసింధుసౌవీర, ప్రాకటదేశముల్ బహుభంగినొప్ప
ధరణిదేవతకర్ణతాటంకమనగ, పరులకసాధ్యమైపరగినవిదిశ
పురమునందునచాలపొలుచుకోటయును,

వ॥ అవ్వరాయీవిధంబునరుక్మాంగదమహారాజు కొలువుకువచ్చేటందుకుమునక లగాయాస్థానకోలాహలుండై నకటికవాడువచ్చేక్రమంబెవిధానసంచేను.

End:

వ॥ అవ్వరాయీవిధంబునబలుకురాజునుకనుంగొనియామంత్రులేమనుచున్నారు.

ద్వి॥ అనఘాత్మమేలుమహాప్రసాదంబు, నీవంటిధర్మాత్మునికిగాకయిట్టి వ్రతమబ్బునేపరవారలకెల్ల.

Colophon: Nil.

S. రుక్మాంగదము.

R. అసమగ్రము. వ్రాతమంచిది. తప్పులుగలవు. శైథిల్యముగలదు. గ్రంథపాత ముంజూపట్టు. గ్రంథకర్తృనామముగానరాదు.

This work is Rukmāṅgadamu of unknown authorship. The Ms. is incomplete.

## 583–586. రుక్మిణీసత్యభామాసంవాదము.

(శాహమహారాజు.)

RUKMIṆISATYABHĀMĀSAMVĀDAMU. (Sāha Mahārāja.)

M. 605; S.—18×1½; L—14; ll.—6; G—350.

Beginning:

చెలువొందరుక్మిణీశ్రీసత్యభామ, తొలుతవచ్చుటయుముద్దులకృష్ణుడంత
చనుదెంచిరుక్మిణిసాదరంబునను, అరయుచుసరసములాడుచుండుటయు
చక్కనికృష్ణునిసత్యభామపుడు, పెక్కువచెలిచేతపిలువనంపుటయు
చెలువునివితమెల్లచెలితెల్పిదెలిసి, కలగుచురుక్మిణికాంతారమునను
పొదరింటికరుదెంచిపొంచివుండుటయు.

* * *

సూ॥ వ॥ అవ్వరాయీవిధంబునతొలుతకథాసంవిధానంవినిపించిన యాతదనంత రంబునశ్రీశాహమహారాజప్రణీతంబైన రుక్మిణీసత్యభామా సంవాదంబనెడు నాటకంబునందు, తొలుత నిర్విఘ్నంబుగాను విఘ్నేశ్వరప్రార్థన చేయుగా విఘ్నేశ్వరుండువచ్చేమార్గం.

End:

సూ॥ ఈరీతిని పలుకగా వారు కృష్ణునితో నేమన్నారు. వృత్తదరువు. చెలువుగా
నీపాద సేవచేసెదము నీపలుకులువిని మేముపరగనడిచెదము పొలుపొందయిది
నిజముపూవిల్తుపదమాన హాయింక వెలయంగ మమ్మేలరా శ్రీకృష్ణ వేడుక
మీరగరారా.

Colophon: Nil.

S. రుక్మిణీసత్యభామాసంవాదము.

R. సమగ్రము. వ్రాంతయొకమాదిరిది. తప్పులుగలవు. శైథిల్యమల్పము. గ్రంథ
పాతముగన్పట్టు. రుక్మిణీసత్యభామాసంవాదమనునాటకమునకు 4 ప్రతులు
గలవు. వానిలో మూడు తాళపత్రములు. ఒకటికాగితపుప్రతి. ఇయ్యదిదేవ
నాగరిలిపిలో వ్రాయబడియె. ఈనాల్గుప్రతులలోపలను గ్రంథాదిని దేవతా
స్తుతి, గ్రంథాంతమున మంగళము అనునవి మృగ్యంబులు. అక్కడక్కడ
కాంతరములకంటె విలక్షణమనదగును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 584. | M. | 603 | $18\frac{1}{2}\times1\frac{1}{4}$ | 36 | | సమగ్రము. |
| 585. | ,, | 604 | $18\times1\frac{1}{4}$ | 21 | | ,, |
| 586. | ,, | 31 | $9\frac{1}{2}\times4$ | 34 | దేవనాగరిలిపినున్నది. | ,, |

R. 586 This is a Paper Manuscript.

## 587. లీలావతీకల్యాణము. (గిరిరాజు.)

## LILAVATIKALYĀṆAMU. (Girirāja.)

M. 630; S—17×1¼; L—31; II.—4; G—400.

Beginning:

....................................దుల్లస
ద్దేవకిరీటకోటిమణిదీధితిదీప్తపదాంబుజద్వయీ
పావనశేషతల్పు.................తానువర్తిరా
జీవదళాక్షుడీవుతవిశేషశుభాళిశరీభశౌరికిన్.

* * *

క॥ కవులాధునికులుశిరునాఁ, కవితకుమాధుర్యధుర్యగరిమముదీర్చఁ
కవికాళిదాసబిల్హణ, భవభూతిమయూరభట్టబాణులదలఁచఁ.

ఉ॥ పన్నుచుగానిపోనిపదపద్యములూరకెయూరలేనియు
ఘ్యన్నతిగాంచిమంచిబుధులుండినచోటికివచ్చికాకవుల్
కన్నపుటచ్చరావళిలగంతలుగట్టిమహీశతాళికిఁ
చెన్నగనమ్మఁజూచుజడచిత్తులకుఁ సయిదోసులేగదా.

ద్విపద॥ శ్రీజన్మభూమియైచెలువంబుకలిసి, రాజిల్లునలమహారాష్ట్రదేశమున
ప్రజలపాలిటివాఁడుపరమపావనుఁడు, రజనీకరాన్వయరాజరత్నంబు
తాళిమిగలవాఁడుధర్మతత్పరుఁడు, మేలిమిగనిమెచ్చుమేలైనదాత
కీర్తిచంద్రికలుమిక్కిలిశేజరిల్లు, కీర్తిచంద్రాహ్వయక్షితిపాలమౌళి
కలిమియుబలిమియుకడలుకొనంగ, పొలుపారకల్యాణపురినేలునపుడు.

దరువు॥ లీలావతివెడలెసొగయిలుమీర । లీ । పటుదగుపయ్యదచనుగవపొదల
నటునిటుముత్యపుహారముగదల, సచగరమయనిసుదతులుచూడ, కచకుచ
భారముకొనసియాడ, అందెలరొదరాయంచలబిలువ, చెందినవేడుకచెలు
వలుగెలవ, వలపులుగలజిగివాతెరచాయ, విలసిలుచిరునగువెన్నెలగాయ.

ఉ॥ పూచెనుమాధవీలతలుపూవులతేనెలుద్రావిజుమ్మనఁ
లేచెనుగండుతుమ్మెదలులేమలయీలువుగొల్లలాడగా
జూచెనుపంచసాయకుడుసోమరితెమ్మెరపిల్లలెల్లెడఁ
వీచెనుచూడవమ్మవనవీథులకాంతవసంతవైఖరుల్.

* * *

**End:**

గిరిరాజనుతలీలశరభోజిభూపాల, సురతకేళినన్నుచొక్కజేసితివి.

ద్వి॥ యోగిని॥ శ్రీసద్గుణోదార సింధుగంభీర, భోసలాన్వయచంద్ర భూసత్ర
దేవేంద్ర, జననాథదినరాజశరభోజరాజ, వినుమునీదాసనావిన్నపంబొకటి.

* * *

యాచంద్రతారార్కమైయుండనయ్యా.

మంగళం. శ్రీరామచంద్రార్పణమస్తు.

**Colophon:** Nil.

**S.** లీలావతీకల్యాణము. దీనలీలావతీశరభేంద్రులకల్యాణకథగానవగు.

R. సమగ్రము. మంగళమయినపిదప "దరువు" తగినప్రాణేశుండు లేని తరుణుల జన్మమేలనే"యనిప్రారంభించి స్వల్పభాగమే చెప్పఁబడెను. వ్రాఁతయొకమాదిరిది. తప్పులుగలవు. గ్రంథపాతముగలదు. శైథిల్యముమెండు. గ్రంథానిగొన్ని దేవతాస్తుతిరూపములగు పద్యములులుప్తములు. గిరిరాజీ గ్రంథకర్తయనిమెచ్చుటనులేకున్నను, "గిరిరాజనుతలీల"యను శాహరాజ సంభోధనముచే గ్రంథకర్తగిరిరాజయియుండనోపు.

The author seems to be Girirāja as indicated by the expression 'Girirājanutalīla' in the end.

## 588—589. లీలావతీశాహరాజీయము.

(బాలకవి సుబ్బన్న.)

LILĀVATIŚĀHARĀJIYAMU. (Bālakavi Subbanna.)

M. 629; S—9×1¼; L—26; Il.—4; G—250.

Beginning:

సీ॥ శ్రితజనస్వాంతవారిజమత్తరోలంబ, గురువరస్తవనీయగుణకదంబ
హారహీరపటీరశారదాభ్రనిభాంగ, విమలకృపాపాంగవృషతురంగ
త్రిపురదానవమదద్విరదమృగాధీశ, భాసురహాసకైలాసవాస
కరధృతశూలమార్కండేయనుతిజాల, వహ్నిలోచనఫాలవ్యాఘ్రచేల
తే॥ భుజగకేయూరదుష్కృతాంబుదసమీర, శైలరాట్చాపనూతనశశికలాప
అఖిలలోకేశకోటిసూర్యప్రకాశ, నీకువందనమొనరింతునీలకంఠ.

కైవారం॥ శ్రీమన్మహాదేవసేవాధురీణ, సీమంతినీనూతనపంచబాణకనకనగధైర్య

* * *

నిరుపమమహాదానదీక్షాధురంధర, దీపాంబికాగర్భశుక్తిస్ఫురన్మౌక్తికాకార, దివ్యతరకేయూర, చోళభూమండలాఖండల, సుకవిరాజమండల, యేకమహారాజకలశపారావారపూర్ణిమాసుధాకర, హితవరశ్రీకర, సంగీతసాహిత్యవిద్యావిలోలశాహాజీమహీపాల,పరాకుసరికవులెన్న బాలకవిసుబ్బన్న మేలిమిమీరహవణించిన లీలావతీశాహరాజీయంబనునాటకంబు నటనపటిమగనుపింపవినుపించెదము దత్తావధానుండవై విననవధరింపుము.

End:

వ॥ ఇవ్విధంబున నాజవ్వనులు శోభానలు పాడుసమయంబున భేరీమృదంగ ఢక్కా హుడుక్కాదివాద్యధ్వనులు నింగిముట్టి చెలంగనుప్పొంగి లీలావతిమంగళంబు పాడుచునటించెనట యెటువలెను. శాహరాజేంద్రునికిజయమంగళం, దివ్యసహజాలంకారునికిజయమంగళం, విలసితాకారునికి, వీరాధివీరునికి, జలధిగంభీరునికిజయమంగళం.

Colophon:

ఇవ్విధంబున మవ్వంబుమీర వాగ్చాచమత్కృతి వెలయసరికవులెన్న బాలకవిసుబ్బన్న మేలిమిమీరహావణించిన లీలావతీశాహరాజీయ్యంబను నాటకంబునకధీశ్వరుఁ.

S. లీలావతీశాహరాజీయము. లీలావతియనురాచకన్యక శాహభూపాలుంజూచి వరించియాయదంతంబుతనతండ్రికెఱింగించుటయు నాతండువల్లెయనియాపెను శాహభూరమణునికిచ్చి వివాహముసేయుటయుననుసదిదీనంబ్రతిపాద్యంబు.

R. సమగ్రము. గ్రంథాంతమున నత్యల్పభాగములు ఖండంబు. వ్రాలుచక్కనివి. తప్పులులేకపోలేదు. శైథిల్యముస్వల్పము. గ్రంథపాఠములేదనరాదు.

The plot relates to the romance between Līlāvatī a young lady of noble descent and Sāha Mahārāja.

589. M. 526 9×1¼ 14 పాఠభేదంబులు పెక్కు. అసమగ్రము.

## 590–596. వల్లీకల్యాణము. (శాహమహారాజ.)

VALLIKALYĀṆAMU. (Sāha Mahārāja.)

M. 466; S—15×1¾; L—37; Il.—4; G—592.

Beginning:

జయపార్వతీరమణ, జయమనోభవహరణ,
జయభుజంగాభరణ, జయలోకశరణ
జయజాహ్నవీధరణ, జయజితాంతకశరణ
జయసరోరుహచరణ, జయజగత్తారణా. జయజయా,

అవురాయీవిధంబునవిఘ్నేశ్వరునిపాదపద్మంబులకువందనమాచరించియాత దనంతరంబునమరిన్నే విధానసంకేను.

శ్లో॥ నృత్తైర్వికారగత్తైఃకరాబ్జవలనైఃతాలాయతైఃకంకణైః
ప్రక్వాణైఃస్మృతితాంగత్తైర్ముఖవలల్గోలాంబమాలారుత్తైః।
వీణాయామృదుగీతిభిఃపరవశానాళీజనాః కుర్వతీ
వాగ్దేవీవదనాంబుజేనిససతిశ్రీశాహపృథ్వీపతేః॥

* * *

End:

సూ॥ వ॥ అవురాయీవిధంబున కుమారస్వామికి వల్లీదేవికి వివాహంబు సేయు సమయంబున నారదకిన్నరకింపురుషులు మంగళంబులుపాడేమార్గం పరాకు.

మంగళం॥ గౌరీశరమ్యవిహారునికి సాకేకృపారసహారునికి మీరినప్రేమను ధీరుల బ్రోచుచుకోరికలొసగెడుగుణనిధికిదేవునికిమహాదేవునికి దేవాధిపనుతభావునికి శ్రీవిభవములపావనుఁడై తగుసేవకనిధియగుశివునికినిభోసలశాహజిభూవిభుని భాసిల్లుప్రేమనుపాలించువాసిగశోభనవైభవసంతతిధీసంపదలిడు దేవునకు.

Colophon:

ఫలస్తుతి.

ద్విపద॥ ఖండేందుధరపాదకంజంబులందు, మెండైనభక్తిచేమీరినవాండు
వాసవవిభుఁడుచిరయశోధనుఁడు, భోసలకులశాబ్ధిపూర్ణచంద్రుండు
సత్యసంధుఁడుసదాచారసంపన్నుఁ, డత్యంతదయాశాలియతిమానసుండు
సరసశిరోమణిశాహభూవరుఁడు, ఇరవొందగాఁరచించినశక్తిధరుని
కల్యాణంబుధరణిలోనెవడుచదివిన,
నెవడువినిననెవండాడిననెవరుచూచినను
సుతులుధనంబులుశుభములుమిగుల,
అతులితమైనట్టియైశ్వర్యములును
పొందుగాకృపనుపాలుపొందవారలకు,
ఇందుశేఖరుఁడిచ్చునీయాప్తితార్థములు.

S. వల్లీకల్యాణనాటకము. ఈశ్వరపుత్రుఁడగు కుమారస్వామికి వల్లియనునామె నిచ్చివివాహంబు సేయుటయిందువర్ణింపఁబడుకథ.

R. సంపూర్ణము. వ్రాఁతబాగులేదు. తప్పులకుప్ప. శైథిల్యములేకపోలేదు. గ్రంథపాతములులేవు. కవి శాహమహారాజు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 591. | M. | 467 | $15\times1\frac{3}{4}$ | 26 | సమగ్రము. |
| 592. | ,, | 468 | 18×1 | 20 | ,, |
| 593. | ,, | 469 | 18×1 | 29 | ,, |
| 594. | ,, | 470 | $16\times1\frac{1}{2}$ | 5 | అసమగ్రము. |
| 595. | ,, | 26 | 9×5 | 51 | సమగ్రము. |
| 596. | ,, | 27 | 9×4 | 18 | ,, |

R. 594. దీనియందుఁగథాప్రారంభమునుండిగలదు.

596. ఏతద్గ్రంథముఖపత్రమునఁ బ్రతాపరాయకృతమని వ్రాయఁబడియె. కాని గ్రంథమందు శాహరాజురచించినట్లు కానఁగు. దీనియంత్యపత్రములనిట్లున్నది. "తారణనామసంవత్సరే, ఆశ్వీయుజమాసే శుక్లపక్షే షష్ఠీస్థిరవాసరే నవరాత్రే విప్రలోపనామ్నా ప్రతాపరాయడు ఊశ్రీ లేఖనం పరిపూర్ణమస్తు."

చివరకాగితముననిట్లుండుటంబట్టి లేఖకులకుఁ బైప్రమాదము వాటిల్లినట్లు తోఁచెడిని. కాఁగా శాహమహారాజే యీగ్రంథకర్తయని తేలినది.

The date of transcription is Saturday the sixth day of the bright fortnight of the month Aśviyuja in the year Tāraṇa.

The scribe's name is Pratāparāya. The story of the marriage of Kumārasvāmin and a girl named Vallī is dramatised here.

Nos. 595, 596. These are Paper Manuscripts.

## 597. వాదజయకొరవంజి.

### VĀDAJAYAKORAVAÑJI.

M. 649; S—$16\frac{1}{3}\times1\frac{3}{8}$; L—8; ll.—5; G—160.

Beginning:

మునివందితచరణుని చంద్రధరునికలంకరుని నగచాపునిఅహీశకంకణునివిజిత
పంచశరుని ముకుందవినుతశీలుని భవబంధ........నిసతవళంకరునిగిరిశుని

గుణవంతునికనకవసంతుని వరదైవంబగుపరమేశునిమునమందుచు నిజహృద యంబున...మిదితో సదయుండ్రవగుచువిదితంబుగకడు నయమొందగధర నేలితో కవిరాజశేఖరధరాధిపా.

* * *

End:

మొలకనగవువెలయగనుపులకముల, పొడమవగవగలసరసములాడినతులా ద్రులనతులాయగు చెలినలయింపు ముదమునసదయకళలు మదిపొదలగళ రవముచెలగనొనరుపుము, శాహధరణీశా కరిరాజగమననిపుడేలితో.

Colophon: Nil.

S. వాదజయకొరవంజి.

R. అసమగ్రము. తప్పులుకుప్పలు. వ్రాంతఃజలుగు. శైథిల్యముగలదు. గ్రంథపాత మంతగాలేదు. గ్రంథనామముగాని తత్కర్తృనామముగాని తెలియ నవకాశ ముగాన్పింపదు. గ్రంథప్రతిపాద్యముకూడఁ దెలియుటకష్టతరము. ముఖపత్ర మున "వాదజయకొరవంజినాటకం" అనినిర్దేశింపఁబడెను.

This drama is Vādajayakoravañji of unknown authorship. The Ms. is incomplete.

## 598–601. వాదజయము. (గిరిరాజు.)

VĀDAJAYAMU. (Girirāja.)

M. 645; S—16×1½; L—36; ll.—4; G—576.

Beginning:

శ్రీగిరిజానాథుజితరిపుయూథు, నాగచర్మాంబరునాగకేయూరు
ఈశునర్వేశుత్యాగేశునేపొంను, భాసురముగామనఃపద్మంబునంను
తలచిసద్భక్తిచేదనరినధీర, జలనిధిగంభీరశత్రుసంహార
రతిపతిసమరూపరవికులదీప, సతతశుభాచారసద్గుణాసార
చోళమహీపాలసురుచిరశీల, లాలితకవిపాలరమణీయలీల
వాసవసంపూర్ణవైభవవిమల, భోసలకులశాహభూపాలచంద్ర
ఘోంకంబుమీరపెంపొందనీమీద, అంకితంబుగనతులవైఖరిని

వాదజయంబను వరనాటకంబు, మోదంబుతో డుత్తమునుకొనియిపుడు
గావించెదను నేనుకవులునుతింప, భూవలయంబునపూజ్యమైపొగడ.

సూ॥ వ॥ అప్పరాయీవిధంబునగిరిరాజకవి శాహరాజదేవేంద్రుపై అంకితంబుగ
నొనర్చినవాదజయంబను నాటకమునందు కథాసంవిధానముగా వినిపించేము
వినసవధరించరయా.

End :

సరిసాటిలేనట్టి శాహేంద్రునికిని శోభానశోభానమే.

మంగళం॥ మహారాజశాహేంద్రునికిమంగళంమిగుల, మహనీయశీలునికిమంగళం
వనధిగంభీరునికివనజలోచనునికి, మనసిజరూపునికిమంగళం
తంజాపురీంద్రునికితరుణీపాంచాలునికి, మంజులభాషణునికిమంగళం
వాసవనిభునికివరసాహిత్యభోజునికి, మహారాజశాహేంద్రునికిమంగళం.

Colophon : Nil.

S. వాదజయనాటకము.

R. సమగ్రము.వ్రాతియొకవిధము. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములులేవు.
ఇందుసత్యభామాకొరవంజియనుగ్రంథముకూడఁగలదు.

This work is Vādajayamu by Girirāja, who dedicated it to Sāha Mahārāja.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 599. | M. | 646 | 17×1 | 31 | అసమగ్రము. |
| 600. | ,, | 647 | $15\frac{3}{4}\times1\frac{1}{2}$ | 30 | ,, |
| 601. | ,, | 648 | 18×1 | 33 | ,, |

## 602. విజయరాఘవకల్యాణము. (కోనేటి దీక్షితచంద్రుఁడు.)

VIJAYARĀGHAVAKALYĀṆAMU. (Kōnēṭi Dīkṣitacandra.)

M. 701 ; S—$16\frac{1}{4}\times1\frac{1}{2}$ ; L—50 ; Il.—6 ; G—1200.

Beginning :

శుభమస్తు.

శ్రీవత్సకౌస్తుభశ్రీసమన్వితవక్షు, చక్రనిర్దళితనిర్జరవిపక్షునీలనీరదవిభానిభరమ
ణీయాంగ, * * * అఖిలజనవైష్ణవభాగధేయ,

శతక్రతుచతుర్వేదితిరుమల శ్రీనివాసతాతయార్యపదపద్మభృంగాయమానాం
తరంగ, చతురవిలాసవతీరంజితనాట్యరంగ, అఖండచోళమండలరక్షణదీక్షా
విచక్షణ, అఖిలావయవసంశోభితశుభలక్షణవిజయరాఘవమహీపాల విజ
యలక్ష్మీవిశాలపరాకుదత్తావధానుండనై చిత్తగింపుము. శ్రీమద్రామాయణో
పదేశసంతుష్టాంతరంగ * * * *
గురురాజ శతక్రతు శ్రీనివాసదేశికప్రతిష్ఠాపితోపాధ్యాయ వైభవధుర్యుం
డును, సకలసద్గుణసాంద్రుండునగు కోనేటిదీక్షితచంద్రుండు కందళద్రసగర్భ
సందర్భంబులనందంబుగా హావణించిన విజయరాఘవకల్యాణంబను నాటక
రాజంబునటనపటిమగనుపించవినుపించేరువిననవధరించుండ.

End:

పదం. కాంభోజి. ఆది.

నిన్నరేయిదానిగూడినీటుమీరి, నిదురమంపునవచ్చితినౌరవోరి, మన్నె
హావ్వీరయిప్పుడునన్నుజేరి, మచ్చుగప్పంగవచ్చిననీదారి.

Colophon:

భరతవాక్యం॥ అనియివ్విధంబున శ్రీమద్రామాయణోపదేశసంతుష్టాంతరంగవిజ
యరాఘవభూపాలకృపాపాంగవీక్షణానుక్షణప్రాప్తసార్వాగ్రహార తారహార
చిరత్నరత్న కంకణోదార తారానురూపముక్తాకలాపహృద్యతర బిరుదవాద్య
నానావాహనాది సన్మానమాననీయ శాశ్వతైశ్వర్యధుర్యుండును, బహు
వారరచితయాగభాగసంతర్పితాఖిలదేవతావర్యుండును, సంగీతసాహిత్యవి
ద్యాధురీణవరేణ్యుండును, రామానుజాచార్యతనయాగ్రగణ్యుండును, భారత
భాగవతాది శిక్షావైచక్షణ్య విజితవిబుధాచార్యుండును, గురురాజ శతక్రతు
శ్రీనివాసదేశికప్రతిష్ఠాపితోపాధ్యాయవైభవధుర్యుండును, ప్రతిపక్షవిశిక్షణ
విచక్షణుండును, సకలసద్గుణసాంద్రుండునగు కోనేటిదీక్షితచంద్రుండు
కందళద్రసగర్భసందర్భంబులహావణించిన విజయరాఘవకల్యాణంబనుమహా
నాటకంబునకుకథానాయకుండునునిజనాయకుండునైనయచ్చుతవిజయరాఘ
వనాయకునకు హేమాబ్జనాయికా రాజగోపాలులు ఆయురారోగ్యసమృద్ధి
యునైశ్వర్యాభివృద్ధియుసర్వశాత్రవనివృత్తియు, సకలసామ్రాజ్య ప్రాప్తియు

నుంగలుగ బాలించిలాలింపుదురుగాత అనుఆశీర్వాదము వేదతుల్యముగా వెల యుగావుత.

S. విజయరాఘవ కల్యాణము. దీన విజయరాఘవనాయక మదనమంజరుల వివాహమహోత్సవంబు నాటకరూపంబుగా వర్ణింపఁబడె.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులులేకపోలేదు. శైథిల్యముగలదు. గ్రంథ పాతము లేదనవచ్చు.

---

## 603. విజయరాఘవచంద్రికావిలాసము.

(కామరుసు వెంకటపతి సోమయాజి.)

## VIJAYARĀGHAVACANDRIKĀVILĀSAMU.

(Kāmarusu Veṅkaṭapati Sōmayāji.)

M. 686; S—16½×1½; L—27; H.—6; G—500.

Beginning:

శ్రీరాజగోపాల కరుణాకటాక్ష వీక్షాలబ్ధవిశ్వవిశ్వంభరాసామ్రాజ్యైశ్వర్యధుర్య నేపాళభూపాలస్థాపనాచార్య * * * చినచెవ్వనృపాలాన్వయ కలశ జలనిధసంపూర్ణపూర్ణిమాసుధాకర పాండ్యతుండీరాదిసమదవిరోధియోధ యూథభీకర సరసకలావిలాసనిస్తంద్రసత్యభామాహరిశ్చంద్ర కళావత్యంబికా గర్భశుక్తికామాక్తికాకార * * భువనైకవీరాధివీరరఘు నాథభూపాలకుమారరత్నాకరగభీరరత్నసానుధీర రమణీరమణీయాకారవిమ లకల్యాణగుణశీలవిద్వజ్జనవిలోలవిదళితరిపుజాలవిజయరాఘవ భూపాలపరా కు * * బహువిధప్రబంధనిబంధలీలాధురంధరుండవైననీకుప్రబం ధంబొసంగి మెప్పించెదనని యెంచినవాండగాననీకువిన్నపించియిన్నరలోకపాక శాసనకృపాపరిపాకసామరస్యంబు వడసిన కామర్సువెంకటపతిసోమయాజి విజయరాఘవచంద్రుని చంద్రికావిహారశృంగారలీలావిలాసంబు వక్కాణించు విజయరాఘవచంద్రికావిహారంబను పేరు పావనించి కవిజిహ్వారంగశృంగాట కంబులధాటినల్పు భారతిఘోటకంబుగా శృంగారరసవర్షావిర్భావంబునకు గర్భోద్భటకంబుగా నొక నాటకంబు నిర్వహింపఁబూని తన యిష్టదేవతయైన

రాఘవస్వామియే విజయరాఘవస్వామి కనుకయితనిం బ్రార్థంచినాందీశుభాచారంబాచరించెనట యెటువలెను.

ద. మధ్యమాది. ఆది.

శ్రీరాజగోపాలసేవాలోల, మొక్కెనుమొక్కెనయా
నారీపాంచాలపరివిశాద, మొక్కెనుమొక్కెనయా.

End:

మనవులకై గడిమన్నె రాజులు కొనివచ్చియిచ్చినకొమ్మలచే దినదినమువిద్యలువినిమెచ్చివారికి చనవులుపాలించునరసునక తుండీర దేశంపుదొరకూతురు పాండినిపట్టమైనపద్మలోచన కొండొకపాయంపుపెండ్లికూంతువై సేవచేయనిందు వేమకనుండు నెరజాణకు.

వ॥ ఆసమయంబున లీలావతీ విజయరాఘవులు మంగళంబుపాడుచూనటించిరట యెటువలెను. మన్నారుదేవికిమంగళం.

Colophon:

భరతవాక్యము.

ఇవ్విధంబునవిజయరాఘవపట్టభద్రునిపట్టంపుకవియైన కామరుసు వెంకటపతి సోమయాజిహావణించినవిజయరాఘునచంద్రికావిలాసనాటకచాటుకావ్యంబునకుకథానాయకుండైనవిజయరాఘునిస్వామికిఅతనియిష్టదేవతయైన రాజగోపాలస్వామి ఆచంద్రార్కంబుగానిశ్వవిశ్వంభరాధిపత్యనిత్యాయురారోగ్యంబులుపాలించిరక్షించుగాత. విజయరాఘునచంద్రికావిహారంసంపూర్ణం.

S. విజయరాఘవచంద్రికావిలాసము.

R. సమగ్రము. వ్రాలుసొగసైనవి. తప్పులులేవనవచ్చును. శైథిల్యముస్వల్పము. గ్రంథపాతముగలదు.

## 604–605. వివేకవిజయము. (చల్ల సూరయ.)

VIVĒKAVIJAYAMU. (Calla Sūraya.)

M. 497; S—17½×1⅞; L—43; ll.—6; G—1032.

Beginning :

శ్రీమత్సదానందచిన్మయయోగి, ధీమహితేక్షితదివ్యప్రకాశు
నాదబిందుకళాదినానాస్వరూపు, పాదుకొనిజభావపదవినిజేర్చి

*　　　*　　　*

అగణితుభవమైద్యుడగునట్టియామ్న, తిలపోసిమదిగురుతప్పకదలచి
వెలయనల్లవివేకవిజయమన్వ, సలలితంబగుపుణ్యచరితంబుమిగుల
*　　　*　　　*, చేసెదనావంశశీలమెట్లనిన
పొందవాకాహ్వయపురవాసిసాంగ, వేదాధ్యయనశాలివిమలమానసుడు
చల్లసంశాంబుధిచంద్రుడైనిష్ఠ, నెల్లవారలుమెచ్చనొచ్చినయతడు
సురుచిరాపస్తంభసూత్రికొండిన్య, వరగోత్రుడద్వైతవాదకపరుడు
సూరుభట్టార్యునిసుతుడుపాపమ్మ, కోరికన్నట్టియాగుణాగణాకరుడు
సూరయార్యుడునాగకోభిల్లునిని, కూరిమియిల్లాలుగుణవంతురాలు
భువిలక్ష్మమయనంగపొగడొందుసాధ్వి, సనతులేనట్టియాసౌభాగ్యగరిమ
నాయిర్వురకుసుతుడైనట్టివాడు, పాయకరాజగోపాలునిగొలిచి
కవితాచమత్కృతిగాంచినవాడు, కవిసూరయనుపేరుగాంచినవాడు
నాటకముఖముసనవ్యకావ్యముల, బాటించికవివరుల్ బాగుగానాత్మ
వంశవర్ణనచేయవలెననికృతుల, సంశయింపకయొక్కసంకేతముగను
వాటికమీరంగవాదిరిగాన, పాడిదప్పకనారిపదవిజేకొనియె.

End :

వ॥ ఈలాగునముక్తికాంతావివాహంబునెరవేర్చివిష్ణుభక్తినిజావాసమునకుజనియె.
వివేకేంద్రుండు ఉపనిషత్కాంతనుగూడిప్రమోదంబునొందె. అద్వైతసార్వ
భౌముండైన జీవేశ్వరుండుముక్తికాంతగూడి యమందతరానందకందళితుండై
యుండెనటయెటువలెను.

ద్వి॥ ముదమునజీవేశమూర్తియుముక్తి, గదిసిభేదముమానికలయికబొంది
కడలేనివేడుకకనరానిచెలిమి, ఉడివోనిమోదమునజ్వాలానంద
మునుబొందిసుఖమందిముల్లోకములను, తనదుతేజముకీర్తిదట్టమైనిగుడ
తనసాటిలేదనితానుదానదెలిసి, వినుతవైభములవెలయుచునుండె,

Colophon:

అనుచు శ్రీరాజమన్నారైనస్వామి, ఘనకృపావర్ధితకవితాతిశయుఁడు
పొందవాకాహ్వయపురనిత్యవాసి, వేదవేదాంగాదివిద్యావిమలుఁడు
చల్లవంశాంబుధిచంద్రుఁడుసూరి, తల్లజుండైనయాతత్వసంవేది
సూరయార్యునకగ్రసుతుఁడైనవాఁడు, సూరిజనస్తుతసురుచిరాత్మకుఁడు
కవిసూరయాఖ్యుండుఘనతత్వవిదుఁడు, విపరింపఁగవివేకవిజయనాటకము
తనపాలవెలయుచింతామణిపేర, కనకవనముచంగమలనుగూడి
సిరులొసంగుచున్నశ్రీదేవుపేర, కరిగాచిరక్షించుకరుణాత్ముపేర
దక్షిణద్వారకాధామునిపేర, నాచంద్రతారార్కమైభూమివెలయ

* * *

తామరతంపరైతమకులంబరయ, సేమమెలర్పంగచిరముందురెపుడు.

చ॥ అలరఁగనీవివేకవిజయాభిధనాటకమెవ్వరేనిని
శ్చలమగుభక్తిచేఁజదువజాలితదీయపదార్థభావముల్
సలలితచిత్తవృత్తిననిశంబునుచింతనసేసిరేనివా
రలఘుతరాత్మతత్వపదమందిశుభస్థితిగాంతురెప్పుడున్.

S. వివేకవిజయనాటకము.

R. సమగ్రము. వ్రాతచక్కనిదే. తప్పులుకొద్ది. శైథిల్యగ్రంథపాతములులేవు. కవిగృహనామముచల్లవారు. కవిపేరు సూరయ. ఈతనితండ్రిసూరయ. తల్లి లక్ష్మమ్మ. తాతసూరభట్టు. తాతభార్యపాపమ్మ. వీరిగ్రామము పొందవాక. తంజావూరుజిల్లాలోనున్నమన్నారగుడియనగ్రామమున వేంచేసియున్నరాజగోపాలస్వామియాతనియిష్టదైవము. సంస్కృతప్రబోధచంద్రోదయమువంటిది.

This work is a philosophical drama by Calla Sūraya, the son of Sūru Bhaṭṭu and Pāpamma and a resident of Pondavāka. The plot relates to the matrimonial union of the Puruṣa or individual soul with Muktikāntā or the lady of salvation.

605. M. 682 16×1 46 సమగ్రము.

R. వ్రాఁతయుందమైనదే. గ్రంథకర్తయు, గ్రంథప్రతిపాదిత విషయమును నొకటియే కాని పాఠభేదమధికము. తుదిపత్రమున మంగళముకలదు.

## 606–609. విఘ్నేశ్వరకల్యాణము. (ఏకమహారాజు.)

VIGHNEŚVARAKALYĀṆAMU. (Ēka Mahārāja.)

M. 515-a S—10×1; L—15; ll.—4; G—150.

Beginning:

జయభక్తపాలకాజయకీర్తిదాయకాజయశ్రీప్రదాయకాజయముదితలోకా.

* * *

భోసలవంశంబువర్ణించేమార్గం.

చూర్ణిక॥ శ్రీమద్భోసల కులశిరోమణియైన, శాహమహారాజు తనూజుండైన లోకైక పాకశాసనుండైన ఏకమహారాజతిసయుండైన శాహమహారాజు సహోదరుండైనశరభరాజస్యానుజుండైనదీపాంబికాగర్భాబ్ధిపూర్ణచంద్రుండైనసూర్యవంశజనపాలుండైన శ్రీమత్తుళజమహారాజకులమానినీ శిరోమణియైన రాజకుమారాంబికానందనుండైనయేకమహారాజప్రణీతంబైనవిఘ్నహరగణేశపరిణయముసకలవిద్వజ్జనశ్లాఘనీయమైసాంబశివప్రీతికరమై సంతానసంపత్ప్రదంబై ఆచంద్రతారార్కమైయుండును.

End:

వ॥ ఇట్లనగావ్యాసభవానీశంకర లక్ష్మీనారాయణాదిసకలదేవతలున్ను తథాస్తు అనుసమయంబునతుంబురునారదాదులు మంగళములుపాడేమార్గం.

సౌరాష్ట్రం॥ శాపు॥ మాగణనాథునికిమంగళంశుభమంగళం, సిద్ధిబుద్ధుల పెండ్లాడిన శ్రీశంకరతనయునికి.

ద్వి॥ రాజేంద్రశరభోజిరాజనందనుఁడు, రాజహంసాంబికారమ్యసుతుండు శ్రీకరగుణములచెలువొందునట్టి, యేకేంద్రవిరచితమీచరిత్రంబు ఎలమితోతుళజేంద్రయేకేంద్రునికిని, బలములుసంతానభాగ్యసంపదలు ప్రణవస్వరూపుండుభక్తపాలకుఁడు, గణనాయకుండిచ్చుగణనమీరగను.

Colophon:

సూ॥ వ॥ ఇతిశ్రీమద్భోసలకులకలశాంభోధిసుధాకర తుళజమహారాజ తనూజ ఏకమహారాజప్రణీతం విఘ్నేశ్వరపరిణయంనామనాటకం సాంబశివప్రీతయే విఘ్నేశ్వరప్రీతయే......న్ముదేసకలశ్రేయసేస్తు.

S. విఘ్నేశ్వరకల్యాణము.

R. సమగ్రము. వ్రాతమంచిదే. తప్పులులేకపోలేదు. శైథిల్యగ్రంథపాతములులేవు. చివరనిట్లున్నది. "గురువయ్యవ్రాలు."

| | | | | | |
|---|---|---|---|---|---|
| 607. | M. | 517 | 17×1½ | 11 | సమగ్రము. |
| 608. | ,, | 520 | 20×1¾ | 14 | ,, |
| 609. | ,, | 522 | 18×1¾ | 12 | ,, |

## 610–616. విఘ్నేశ్వరకల్యాణము. (శాహమహారాజు.)

VIGHNEŚVARAKALYĀṆAMU. (Śāhamahārāja.)

M. 523; S—15×1½; L—29; ll.—4; G—464.

Beginning:

తోడెం. రాగం నాట. తాళం ఝంపె.

జయపార్వతీరమణ, జయమనోభవహరణ, * * *

సూ॥ వ॥ అవురా యీవిధంబున నిష్టదేవతాప్రార్థనసేసిన యాతదనంతరంబున శ్రీశాహమహారాజప్రణీతంబైన విఘ్నేశ్వరకల్యాణమనెడు నాటకంబు కథాసంగ్రహంబుగావినిపించెదము, విననాధరించరయ్యా.

End:

దరువు. ఆదితాళం. గుమ్మకాంబోదిరాగం. మాతృక.

మాగజముఖునికిమంగళం నిత్యంమదనహరసుతునికిమంగళం రంజితభక్తునికి రాజశిరోమణికి మంజుళరూపునికిమంగళం శాహజిరాజేంద్రు పాలసతతము మెలంగుసామికిమహనీయరూపునికిమంగళం.

Colophon:

సూత్రధారవచనం ॥

ఇతిశ్రీమద్భోసలకుల శాహమహారాజవిరచితం విఘ్నేశ్వరకల్యాణనాటకం సకలరసికవిద్వజ్జనప్రీతయేశ్రీత్యాగేశసాంబశివార్పణమస్తు.

S. విఘ్నేశ్వరకల్యాణము.

R. సంపూర్ణము. వ్రాతయొకవిధము. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు. గ్రంథాంతముననిట్లున్నది. "భోసలకులశాహామహారాజ ప్రణీతంబైన విఘ్నేశ్వరకళ్యాణంబను మహానాటకంసంపూర్ణమగునట్లుగా వ్రాసినవరుండు లేఖరివెంకటరంగయ్య."

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 611. | M. | 518 | 16×1 | 32 | | సమగ్రము. |
| 612. | ,, | 519 | 18×1½ | 13 | | అసమగ్రము. |
| 613. | ,, | 521 | 18×1 | 17 | | ,, |
| 614. | ,, | 1 | 10×4 | 16 | నాగరిలిపిలోవ్రాయఁబడె. | సమగ్రము. |
| 615. | ,, | 2 | 9×5 | 48 | ,, | ,, |
| 616. | ,, | 26 | 16½×1 1/10 | 61 | గ్రంథలిపిలోనున్నది. | ,, |

Nos. 614, 615. These are Paper Manuscripts.

## 617. విప్రనారాయణచరిత్రము.

(విజయరాఘవనాయకుఁడు.)

VIPRANĀRĀYAṆACARITRAMU. (Vijayarāghava Nāyak.)

M. 706; S—16×1½; L—28; ll.—6; G—672.

Beginning:

సీ॥ భోజకన్యాముఖాంభోజరాజమరాళ, + కేలుమోడ్చెదరాజగోపాలనీకు.

* * *

వ॥ విజయరాఘవనాయకపరాకుస్వామివారుహావణించినవిప్రనారాయణచరిత్రం బనువిచిత్రనాటకంబునటనపటిమగనుపించవినుపించేమువిననాధరించరయ్యా.

End:

వ॥ మన్నారుదేవికిమంగళం శ్రీరామా శ్రీరుక్మిణీసత్యభామాసమేత శ్రీరాజ గోపాలాయమంగళం శ్రీఅలమేలుమంగాసమేత శ్రీవెంకటేశాయమంగళం శ్రీగోపాలకృష్ణాయనమః.

Colophon: Nil.

S. విప్రనారాయణచరిత్ర.

R. సమగ్రము. వ్రాతయందమైనదే. తప్పులుగలవు. శైథిల్యము మెండు. గ్రంథపాతములులేవు.

## 618-619. విష్ణుపల్లకిసేవాప్రబంధము.

(భోసల శాహమహారాజు.)

## VIṢṆUPALLAKISEVĀPRABANDHAMU.

(Bhōsala Śāhamahārāja.)

M. 651; S—17×1¾; L—29; Il.—4; G—464.

Beginning:

జయరమాపురవాసజయచంద్రికాహాస, జయసుమేరుశరాసజయకృత్తివాస.

* * *

సూ॥ ఇత్తెరంగునపలుగాకులైనకాకవినికరంబులపక్షంబులనుగ్గాడికవసవనసుకవులైన సుకవులకు జోహారుజేసి చతురుదధివసనవలయితరసాతలరాజమానరాజన్యమస్తకన్యస్తమణిముకుటమసారమరీచిమంజరీపుంజమిళిందమాలికామనోహరపాదారవిందుండునుసుందరీబృందమకరందసాయకుండునుమకరమకరందఝషముఖప్రముఖబిరుదాంకుండును భోసలకులజలనిధిశశాంకుండును పరాశరప్రభవకణాశనపణినసుతపతంజలిగవీగుంభనజరీజృంభమట్టంకన సముద్ధృతరాద్ధాంతకలనాద్వితీయుండును మహారాజవిలాసనివాసనిబరీసనీకు వేలవందనమాలికారచనాచణకటాక్షాలక్ష్మీమవశంవదుండును కలితసంగీతతానశ్రుతిస్వరస్థానరాగాంగగానక్రియాస్థాయి గమక ప్రబంధధాతుగాయనగుణతతానద్ధదాహకుండును? దీపాంబికాగర్భశుక్తిముక్తాఫలంబగు శ్రీశాహవసుంధరాపురందరుండురచియించిన పల్లకీసేవప్రబంధంబునతొలుత విఘ్నేశ్వరప్రార్థనసేయుగావిఘ్నేశ్వరుండువచ్చేమార్గం.

End:

సూ॥ ఇత్తెరంగున స్వామిమేలుకొన్నతదనంతరంబున శోభనమునుడివే క్రమము పరాకు.

శోభానమే శ్రీహరికి శోభానమె శ్రీపతికి శోభానమె శోభానమే శౌరికిని శోభానమెలక్ష్మికిని శోభానమె నగవరోద్ధారునికి నగసన్నిభకుచయుగకు గగనవర్ణునికి గగనమధ్యకును శోభానమె శంబరరూపునకు శంబరనయనకు అంబుజనాభునికి అంబుజగేహకును శోభానమె త్యాగేశమిత్రునికి త్యాగేశసోదరికి భోగీశశాయికిని భోగేశవేణికిని శోభానమె ॥ మంగళం.

Colophon :

ద్విపద॥ శ్రీలోలు పేర నాశ్రితపాలు పేర, నీలవర్ణుని పేర నిరుపము పేర
నారాయణుని పేర నగధరు పేర, వారిజోదరు పేర వైకుంఠు పేర
పల్లకి సేవప్రబంధరత్నంబు, పల్లవాయుధ సమప్రభ గలవాఁడు
భూపాలమణి యేకభూధవపత్ని, దీపాంబగర్భాబ్ధిదివ్యరత్నంబు
సత్యభామాహరిశ్చంద్రుఁడు త్తముఁడు, సత్యాగరాజాంఘ్రిసన్నుతిపరుఁడు
వాసుదేవచరిత్రవర్ణనారతుఁడు, భోసలకుల శాహభూపాలమౌళి
విరచించె సత్కృప విస్మయమంద, ధరణిలో నాచంద్రతారార్కముగను.

S. విష్ణుపల్లకి సేవాప్రబంధము.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిదే. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములు లేవు.
"వ్రాలాశభ్రిలుతప్పులు, చాలాగలవేను శబ్దసంగతు లెరుగన్
గేలింబెట్టకనవ్వక, పోలంగాజూడరయ్యబుధజనులారా. ఇంద్రజిత్తువ్రాలు."
అనితుదినున్నది.

619. M. 653 $16\times1\frac{3}{4}$ 10 అసమగ్రము.

R. కథాప్రారంభమునుండి గలదు. 618 నెం. ప్రతియందుదాహృతమగు కవివర్ణనాదికమిందుగన్పట్టదు. తుదినిట్లున్నది. "శరకృతమపరాధంక్షంతుమర్హంతి సంతః" కథావిషయమునరెండునొకటియే. ఏకకర్తృకములునగును.

## 620–624. శంకరపల్లకి సేవాప్రబంధము

(భోసల శాహమహారాజు.)

## SANKARAPALLAKISĒVĀPRABANDHAMU.

(Bhōsala Śāhamahārāja.)

M. 650: S—6×1: L—41; ll.—4; G—328.

Beginning:

శ్రీకరిముఖునిపోషితచతుర్ముఖుని, ఏకదంతునిదురితేభకేసరిని
తారకదైత్యవిదారినిగుహుని, గారవంబునగన్నగౌరీశంకరుల
పల్లకిసేవప్రబంధంబుగాను, ఉల్లాసమునచతురోదధివలయ
సర్వసర్వంసహాచక్రంబునేలు, సర్వపాదాంబుజసన్నుతిపరుఁడు
వాసరవల్లభాన్వయరాజమౌళి, భోసలశ్రీశాహభూపురందరుఁడు
విరచించెకవులెల్లవేనోళ్లఁబొగడ, ధరణిలోనాచంద్రతారార్కముగను.

End:

మాపాలిదేవునికిమంగళం మముగన్నతల్లికిమంగళం । పల్ల । గంగాధరునికి
కరుణాబ్ధికిదివ్య మంగళదేహునికిమంగళం సంగీతరసికకుజలజాక్షికి సర్వమంగ
ళకుదేవికిమంగళం ముదితశంకరునికి మోహనాకారునికి మదనసంహారునికి
మంగళం సదయాపాంగకు స్మరజవనదాయినికి మదవతిగిరిజకుమంగళం రహి
గలత్యాగేశుకు రాజమౌళికి శాహమహీపాలదేవునికిమంగళం గజముఖులను
కూరిమితోగన్నమహితగుణాఢ్యకుమంగళం.

Colophon:

శ్రీశంకరునిపేరశ్రీగౌరిపేర, వాసవార్చితుపేరపార్వతిపేర
కేశవనుతిపేరగిరిసుతపేర, ఈశునిపేరసర్వేశ్వరిపేర
భోగిభూషణుపేరపూబోణిపేర, త్యాగేశుపేరకాత్యాయనిపేర
పల్లకిసేవాప్రబంధంబుదివస, వల్లభాన్వయుఁడేకవసుధేశధర్మ
పత్నిదీపాంబగర్భస్నిగ్ధపేటి, రత్నంబుశ్రీశాహరాజదేవేంద్రుఁ
డొనరించెకవులెల్లనుల్లసిల్లంగ, దనరుచునాచంద్రతారార్కముగను.

S. శంకరపల్లకిసేవాప్రబంధము.

R. సమగ్రము. వ్రాఁతయొకవిధము. తప్పులున్నవి. శైథిల్యగ్రంథపాతములులట్లే.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 621. | M. | 652 | 14×1 | 21 | | సమగ్రము. |
| 622. | ,, | 8 | 9×4 | 18 | నాగరిలిపిలోవ్రాయఁబడియె. | ,, |
| 623. | ,, | 9 | 5×2½ | 17 | ,, | ,, |
| 624. | ,, | 10 | 6½×4 | 10 | ,, | ,, |

R. 623. చివరన "ఈనాటకమనంతయ్యస్వహస్తలిఖితము" అనియున్నది.

Nos. 622–624. These are Paper Manuscripts.

## 625–627 శచీపురందరము. (శాహమహారాజు.)

ŚACIPURANDARAMU. (Śāhamahārāja.)

M. 548; S—15×1⅜; L—40; II.—5; G—760.

Beginning:

తోడె. నాటరాగం. ఝంపెతాళం.

జయపార్వతీరమణజయమనోభవహరణ, * * *

సూత్రధారవచనం॥ అపురాయీవిధంబునసభీష్టదేవతావందనంబుగావించి సభానాయకాదులనభివర్ణించిశ్రీశాహమహారాజప్రణీతంబైనశచీపురందరంబనెడు నాటకంబుకథాక్రమంబుగావినుపించేమువినవధరించరయ్యా.

End:

పావనుండైతగుసేవకనిధియగు శివునికిని, భోసలశాహజి భూవిభునిభాసిలు ప్రేమనుపాలించువాసిగశోభనవైభవసంతతిధీసంపదలిడు దేవునకు.

Colophon:

ఇతిశ్రీభోసలశాహమహారాజవిరచితశచీపురందరకల్యాణమహానాటకంసకల రసికవిద్వజ్జనప్రీతయేసకలశ్రేయసేశ్రీత్యాగేశసాంబశివార్పణమస్తు.

S. శచీపురందరము.

R. సమగ్రము.తప్పులుగలవు.వ్రాలుచక్కనివి.శైథిల్యముగలదు. గ్రంథపాతముంజూపట్టు. "ఈయలేఖమునందు ప్రథమనాటకం గణపతి రెండోది సరస్వతి మూడోది పార్వతి నాలుగోది సీత అయిదోది రామపట్టాభిషేకం ఆరోది యీనాటకం దీనికిపేరు శచీపురందరం సంపూర్ణమగునట్లువ్రాశిన తాలేఖలు ఠం వెంకటరంగయ్యవ్రాశినా...

The scribe's name is Veṅkaṭaraṅgayya.

The author is Śāha Mahārāja who ruled Tanjore from 1684 A.D. to 1710 A.D.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 626. | M. | 547 | $15\times1\frac{1}{4}$ | 52 | పాఠభేదంబులువ్రాత్కా. | సమగ్రము. |
| 627. | ,, | 549 | $18\times1$ | 18 | ,, | అసమగ్రము. |

## 628–630. శాంతాకల్యాణము. (భోసల శాహమహారాజు.)

ŚĀNTĀKALYĀṆAMU. (Bhōsala Śāhamahārāja.)

M. 619; S—18×1; L—26; Il.—4; G—416.

Beginning:

జయపార్వతీరమణజయమనోభవహరణ * * *

అనియెడికథలచేనమరివేడుకను, దనరుచునుండు శాంతాపరిణయము

ఘనుఁడుశాహేంద్రుండుగావించెభువిని, పనివడియానందభరితుఁడై చాల

సరసనత్కవివరుల్ సన్నుతిచేయ, ధరణిలోనాచంద్రతారార్కముగను.

End:

సూ॥ వ॥ అవురాయీవిధంబున ఆ ఋష్యశృంగమునీశ్వరునికిన్ని శాంతాదేవికిన్ని

వివాహంబుచేసేసమయంబున ఆ నారదకిన్నరకింపురుషులు మంగళంబులు

... పాడేమార్గంపరాకు. మంగళంపాడేది. మన్నారుదేవికిమంగళం.

Colophon: Nil.

S. శాంతాకల్యాణము.

R. సమగ్రము. వ్రాఁతమంచిదే. తప్పులుపడక. శైథిల్యగ్రంథపాతములులేవు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 629. | M. | 618 | $16\times1\frac{5}{8}$ | 28 | మూషికదంశితము. | అసమగ్రము. |
| 630. | ,, | 620 | $18\times1$ | 25 | | సమగ్రము. |

## 631. శాహమహారాజకల్యాణము.

ŚĀHAMAHĀRĀJAKALYĀṆAMU.

M. 680; S—16×1; L—45; Il—3; G—540.

Beginning:

శ్రీమానినీమణిచిత్తాంబురుహభృంగ, కమనీయకాంచనఖగతురంగ

నీలమేఘసమనిరుపమశుభకాయ, సనకాదిమునిభక్తజనవిధేయ.

* * *

...ర్లింపదగినతంజాపురంబునమంజుభాషణంబులవినుతించెనటయొటువలెనా...

End :

సీ॥ ఎంతకాలముచంద్రుఁడీశునిమౌళి పై, కాంతివంతుండయికదలకుండు
నెంతకాలముదివ్యదంతావళంబులు, దిక్కులయందులఁదియ్యకుండు
నెంతకాలము రాక్ష సేంద్రుండులంకలో, పట్టాభిషిక్తుఁడైపరగుచుండు
నెంతకాలమురమాకాంతుండసంతుని, తల్పంబుచేసుకతనరుచుండు

తే॥ నంతకాలము...........

Colophon : Nil.

S. శాహామహారాజకల్యాణము.

R. అసమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులులేకపోలేదు. శైథిల్యముగలదు. గ్రంథపాతముంజూపట్టు. గ్రంథముతుదిని స్వల్పభాగము నష్టమనితోఁచెడి.

This work is Śāhamahārājakalyāṇamu of unknown authorship. The Ms. is incomplete.

## 632. శాహరాజవిలాసము. (శేషాచలపతి.)

### ŚĀHARĀJAVILĀSAMU. (Śeṣācalapati.)

M. 676 ; S—15×1 ; L—39 ; ll.—4-5 ; G—700.

Beginning :

శా॥ శ్రీమద్గౌరికటాక్షమీశుముఖరాజీవంబునన్ షట్పద
స్తోమంబాతరినిచ్చె నెచ్చెలియగ్రంథుల్ లజ్జయాతల్లికిన్
ప్రేమన్ సమ్మతిసేయసంగతసుఖాప్తిన్ మీరునాదంపతుల్
క్షేమంలబ్ధకుమారుఁ జేయుతస్వరీతిన్ శాహభూవల్లభున్.

* * *

సీ॥ శ్రీకరగుణశాలియేకేంద్రసుతమౌళి, సారిరాగానొక్కసరసిజాక్షి
చూచిమోహించుచుశుకముఖ్యదూతిక, లంపిమన్మథవివశాత్మయగుచు
వనకేళిమీనకేతనుపూజలొనరించి, శుభసూచకంబైనసూక్తివలన
అవిలంబముగచెలుల్ ప్రాణేశుఁడౌశాహ, విభునితోఁగూర్చినవిభవమెల్ల

తే॥ లలితగతిశాహరాజవిలాసమనెడు
నాటకమురచించుబుధులుసంతసమునొంద

ధీచమత్కృతివెలయు శేషాచలపతి
అష్టభాషాకవిత్వంబులమరుసుకృతి.

*　　*　　*

భవ్యపరమాయురస్తునీపానూజ. సర్వసంపత్సదాస్తు తేశాహ రాజ.
ఈరీతికథాసూత్రంబునకుపాత్రంబగుభోసలవోత్రాని తారచారిత్రం బెట్టిదనిన.
శ్రీకరుండగుచంద్ర శేఖరుకరుణ, చేకీర్తి తియులైన శ్రీకీర్తి తతులఁ
బరగిశంకరుపాదపద్మముల్ మోద, సరణిచేఁబూజించినసంపదల్ గాంచి
హారిమహారాష్ట్రమనుమహారాష్ట్ర, ధారుణిభూమించతనరజనించె
భోసలకులసింధుపూర్ణసచ్చంద్రుఁ, డై సదామించుప్రఖ్యాతులుగాంచు
శ్రీశాహరాజుభాసితకీర్తి తేజుఁ, డై సార్వభౌముఁడింపలరుశ్రీరాము
పగిదిదుర్నామాదిపాపవిచేడి, సగుణశాసనుఁడతిచండశాసనుఁడు
అతనినందనుఁడతులశృంగారుడార్జవగణోదారు, డాతడీభూలోకమునవుండుదాక
భాతిగానేకాతపత్రసంజాత, శీతలచ్ఛాయగాచిసుఖంపచేయు
ఆతరిభూరాజులనిరియారాజు, యేకమైధరలోననిరపాందుగాన
యేకరాజనభూమినెనగునాసామి, తనకులాంగనలందుతగుఖ్యాతిఁజెందు
వినయావలంబశ్రీవెలయుదీపాంబ, యందునందనులశివాభివందనుల
మందరోన్నతుఁలసన్మార్గసన్నుతుల, గాంచె శాహనృపాలుకమనీయశీలు
అంచితవిభవేంద్రుఁడగుశరభేంద్రు, తుళుజభూపాలునిస్తులదానశీలు
చెలగిరివారలూర్జితలక్ష్మిమీర, అందగ్రజుండుపర్యవితాగ్రజుండు
కందర్పరూపుఁడుఖండితాటోపు, డర్కప్రతాపుఁడాహావదిలీపుండు
అర్కజసమదానుఁడసమానమాను, *　　*　　*
యవనాసురులనెల్లనరిమునభల్ల, జవనతశిక్షించిజగతిరక్షించి
వంగమ్ముగాంచెద్రవిణోర్విమించె, మద్రంబాక్రమించె
వంగభూమిభరించెవపకాశిగాంచె, జాలిగలంబేలెపాంచాలోర్విప్రాలె
సౌరాష్ట్రమెట్టెనుశకభూమికట్టె, నారట్టకముచేరెనాంధ్రోర్విమీరె.

**End:**

శంగి॥ నలనిమేనునునారయఖకొడవలి, పలవెంట్రుకలుబలికడుపు, కలుబుంగయు

నః నల్లదట్టియునుచిల్లగోలయును చేయుమర, వెంగలినడయును వేలచూపులును
కొంగరెక్కలునుకుండయునుచొంగయుమీారగశింగిచేయుచును.

Colophon : Nil.

S. శాహరాజవిలాసము. దీనశాహరాజుయొక్క విలాసచేష్టితములువర్ణితములు.

R. అసమగ్రము. వ్రాఁతరోఁత. తప్పులుపెక్కు. శైథిల్య గ్రంథపాతములధికము.

## 633–635. శివకామసుందరీపరిణయము.

(తుళజ మహారాజు.)

SIVAKĀMASUNDARIPARIṆAYAMU. (Tuḷaja Mahārāja.)

M. 559; S—21×1⅜; L—39; ll—3; G—468.

Beginning :

జయసర్వజగదీశ జయశైలజాధీశ, జయ... కేశ జయచిత్ప్రకాశా
జయభక్తభయనాశ జయనిర్జితరతీశ, జయశంకరగిరీశ జయదయనభేశా
జయజయా.

*　　*　　*

నాద్యంతేసూత్రధారః. సూ॥ వసంతఋతువర్ణన.

క॥ విలసితకిసలయసమసుమ, ఫలపరిమలశోభితములు భావజచాపో
జ్జ్వలగుణశుకపికముఖరవ, మలయానిలభాసురములుమధువాసరముల్.

వ॥ ఓరీపారిపార్శ్వకయిటువంటిమధుమాసమందు భోసలకులకలశాంభోధిపూర్ణ
చంద్రుమాళోజీరాజపురందరనందనసాహసాంక శాహ మహారాజతనూజభా
మామనోజ్ఞ మహారాజకుమారశాహమహారాజశరభభూపాలానుజుండగు,
తుళజవసుంధరాపురందరుండు ఆదివరాహస్వామికిమహోత్సవంబుగావింప
గోరిసకలదేశములయందుండిరసికవిద్వజ్జనులువచ్చినారోయి.

చ॥ సురుచిరపుణ్యశీలులనసూయులుసర్వకళావిదుల్ దయా
పరులుకృతజ్ఞులుత్తములుపావనలీసభవారుమెచ్చభా
సురతుళజక్షితీశకృత . దమనశివకామసుందరీ
పరిణయరూపనాటకముబాగుగనాడుదమీాసభాస్థలిన్.

**End:**

మెరుగులీనుబంగారుబొమ్మా, మేలైనమరువంపు రెమ్మా, పరమశివునిముద్దు గుమ్మా, వరదేవతాబ్రోవవమ్మా. కవిచెలువలమితారి, వలరాయనిచేతి కతారి, సలలితములవొయ్యారి, సకలాగమారామమయూరి.

Colophon: Nil.

S. శివకామసుందరీపరిణయము.

R. సంపూర్ణము. వ్రాఁతబాగు. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాఠములునన్లే.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 634. | M. | 560 | $19\frac{1}{2}\times1\frac{1}{8}$ | 42 | పాఠభేదములున్నవి. సంపూర్ణము. |
| 635. | ,, | 561 | $18\times1\frac{1}{4}$ | 42 | ,, ,, |

## 636–637. శివపారిజాతము. (వెంకటకృష్ణ కవి.)

## SIVAPĀRIJĀTAMU. (Veṅkaṭakṛṣṇa Kavi.)

M. 666; S—18×2; L—18; ll.—6; G—432.

Beginning:

క॥ శ్రీశివపుత్రవినాయక, శ్రీకరముగనీకుమ్రొక్కి శ్రీశివుచరితం
బీశివసభలోఁబాగడెద, వాసిగపలికించవయ్యవరగణనాథా.

* * *

సీ॥ మల్లువంశంబునమాకనింబజచేత, చెల్వొలై వెలసినమల్లులందు
కనకయ్యపుత్రుఁడకమలాక్షుసేవ్యుఁడ, ఘనవసిష్ఠకులుండకవులబంట
వెంకప్పయనుకవిచెప్పినశివకథల్, పుంఖానుపుంఖమైప్రబలుచుండ
పసిబాలుఁడనునేనుపశుపతింబొగడఁగ, రసికులెల్లనువినిరమ్యమొంద
తే॥ వేదములయందుదాగినవింతయొకటి
హరియుఁజెప్పంగనపురూపుహరునికథలు
నారదునిచేతఁదెలిసెనునాణ్యముగను
ధరణిలోనేనుబొగడెదధర్మనిపుణ.

* * * *

వ॥ శ్రీకరంబుగావిఘ్నేశ్వరుఁడువచ్చినవెనుక సకలవిఘ్నాలున్నుతీర్చినవెనుకశివ పారిజాతనాటకమాడేటువంటిమార్గం.

**End:**

క॥ కందము జెప్పెదవినవే, సుందరినాపక్కఁ జేరుశుభలగ్నమునఁ
ఇందుధరుండ నెనేనును, పొందుగ నన్నేలుకోవే పువ్వులకొమ్మా.

గంగవాక్యం. మంచిదిసామిరారబహు మంచిదిగలుగునునీకు మేలుగా
చంచలమెల్లదీర్చినను శ్రీశివభోవ వెప్రాణనాయకా.

మంగళం, * * *

శృంగారకరముగాఁ జెలగి మ్రొక్కి, శ్రీజయముకలుగునని శ్రీ వెంకటుడనేను
శ్రీ వెలయఁ జెప్పితిని శివకథలును జయమంగళమునిత్యశుభమంగళము.

* * * *

విద్యవిజయములిచ్చిబుద్ధిచిరములనిచ్చి, సిద్ధివరములనొసగి చెలువమొసగు
జయమంగళంనిత్యశుభమంగళం.

Colophon:

శ్రీమత్సకలగుణసంపన్నులయిన అఖండలక్ష్మీప్రసన్నులయిన అష్టలక్ష్మీనివా
సులయిన శిష్టజనరక్షకులయిన నిత్యాన్నదాన గోదాన భూదాన వస్త్రదాన
హిరణ్యదానకన్యకాదాన పరిపాలకులయిన శ్రీరజతాచలహిమాచలకనకా
చలసమానధీరులయిన శ్రీరాజమాన్యరాజరాజరాజశ్రీశివాజీమహాపాలుని
తెలుఁగుకవి వెంకటకృష్ణాజెట్టికనకాజెట్టి చేసినకవిత్వం.

S. శివపారిజాతము.

R. సమగ్రము. వ్రాఁతయొకవిధము. తప్పులతడక. శైథిల్యగ్రంథపాతములు లేవు.
చివరనిట్లున్నది "యీశివపారిజాత నాటకం శ్రీతంజపురీంద్రు శ్రీశివాజీమహీ
పాలునికులదేవుఁడైన శ్రీచంద్రమౌళీశ్వరునికృపచే వ్రాసినకవిత్వం."

Veṅkaṭakṛṣṇa Kavi is the court-poet of Śivāji Mahārāja.

637. M. 690 16×1 36 అసమగ్రము.

R. దీన 636 నెం. కంటెనాదినీదరువుకలదు. "దరువు॥ శరణుశరణుశరణు శ్రీగజ
ముఖ." 636 నెం. ప్రతియందుఁగల Col. ఇందుగానరాదు. మంగళముతోఁ
బూర్తియగుచున్నది. ముఖపత్రమున "దరువులు" అనియున్నది.

## 638–643. సతిదానశూరము. (భోసల శాహమహారాజు.)

SATIDĀNAŚŪRAMU. (Bhōsala Śāhamahārāja.)

M. 622; S—18×1¾; L—55; II—4; G—880.

Beginning:

శ్లో॥ జయపార్వతీరమణజయజానకీరమణ,+జనాభరణ.

*　　　*　　　*

అనిమెడికథలచేసనురిరాజిల్లు, చునుమించుసతిదానశూరనాటకము

విరివిగాశాహభూవిభుఁడుగావించె, ధరణిలోనాచంద్రతారార్కముగను.

సూ॥ అవురాయీవిధంబునశ్రీశాహమహారాజప్రణీతంబైన సతిదానశూరనాట

కంబునందు.

End:

సూత్ర॥ అవురా యీవిధంబునఁబరమేశ్వరుండు బ్రాహ్మణునికి సాయుజ్యమున్ను

మాదిగవానికి సారూప్యమున్ను మతంగభామినికిసామీప్యమున్ను విద్యార్థికి

సాలోక్యమున్ను ఇచ్చిన యీ తదనంతరంబున నారదకిన్నరకింపురుషాదులు

మంగళంపాడేమార్గం.

Colophon: Nil.

S. సతిదానశూరనాటకము.

R. సంపూర్ణము. తప్పులు లేకపోలేదు. చక్కనిదేవ్రాఁత. శైథిల్యగ్రంథపాతములు

లేవు. ముఖపత్రమున "సతీపతిదానవిలాసము" అనికలదు. కానిలోన సతి

దానశూరమనియుండుటంబట్టియదియేపేర్కొనఁబడియె.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 639. | M. | 621 | 19×1⅛ | 64 | ఆద్యంతములుగన్పట్టవు. అసమగ్రము. |
| 640. | ,, | 623 | 19×1¾ | 42 | ఆది కానరాదు. ,, |
| 641. | ,, | 688-b | 16×1⅜ | 5 | ,, |
| 642. | ,, | 5 | 10×4 | 76 | దేవనాగరిలిపి. ,, |
| 643. | ,, | 6 | 10×4 | 8 | ,, ,, |

R. 640. ఆద్యంతములయందు "రామయవ్రాసినపుస్తక" మనియున్నది.

పలువిధంబులగుపాఠభేదంబులీప్రతులలోగనుపట్టు.

Nos. 642, 643. These are Paper Manuscripts.

## 644–650. సతీపతిదానవిలాసము.

(భోసల శాహమహారాజు.)

SATIPATIDĀNAVILĀSAMU. (Bhōsala Śāhamahārāja.)

M. 624; S—18×1¾; L—22; Il.—4; G—352.

Beginning:

జయ దేవకీపుత్ర, జయదివ్యనుతిపాత్ర+జయజితామిత్ర.

*                    *                    *

అనియెడికథలచేనమరివేడుకను, దనరుసతీపతిదాననాటకము

సరసశుభోక్తులసంతసంబునను, విరివిగాశాహభూవిభుఁడుగావించ

వరకవీశ్వరులెల్లవర్ణనచేయు, ధరణిలోనాచంద్రతారార్కముగను.

End:

సూత్ర॥ అప్పుడాయీవిధంబున నీరీతినారదుఁడుస్తుతిసేయు సమయంబునసురలు

నారదకిన్నరకింపురుషులుమంగళంబులుపాడేమార్గం పరాకు.

దరువు॥ మందరధరునికిమాధవునికి          *          *

శోభానశోభానమె.భోసలశాహజిభూవిభునిబా.........మువాసిగశోభన

వైభవసంతతిధీసంపదలిడుదేవునికిశోభానశోభానమె.

Colophon: Nil.

S. సతీపతిదానవిలాసనాటకము.

R. సంపూర్ణము. వ్రాఁతమంచిదే. తప్పులులేకపోలేదు శైథిల్యముమెండు. గ్రంథ

పాతములులేవు.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 645. | M. | 625 | 16×1¾ | 26 | సమగ్రము. |
| 646. | ,, | 626 | 18½×1 | 21 | గ్రంథాంతముగన్పట్టదు. అసమగ్రము. |
| 647. | ,, | 627 | 18×1⅓ | 12 | గ్రంథాదిగానరాదు. ,, |
| 648. | ,, | 628 | 16×1¾ | 10 | ఆద్యంతములుగన్పట్టవు. ,, |
| 649. | ,, | 3 | 9×5 | 68 | నాగరిలిపి. సమగ్రము. |
| 650. | ,, | 4 | 9×4 | 18 | ,, అసమగ్రము. |

Nos. 649, 650. These are Paper Manuscripts.

## 651–657. సరస్వతీకల్యాణము. (భోసల శాహమహారాజు.)

SARASVATĪKALYĀṆAMU. (Bhōsala Śāhamahārāja.)

M. 610; S—15×1¾; L—67; ll.—4; G—536.

Beginning:

జయ దేవకీపుత్ర, జయదివ్యనుతిపాత్ర+జయజితామిత్ర.

* * *

అన్నాడుగనుక అపురాయీవిధంబునసభీష్టదేవతావందనంబుగావించి సభా
నాయకాదులనభివర్ణించి శ్రీశాహమహారాజప్రణీతంబైన సరస్వతీకల్యాణం
బనెడునాటకంబుకథాక్రమంబుగావినుపించేము విననాధరించరయ్యా.

* * *

అగుచొక్కనాథమహామాత్యనాథు, సుగుణసత్పుత్రుండుసుజనమిత్రుండు
చిరపుణ్యావరమతి శేషాచలపతి, వర శాహావిభుపేరవహించి దైవార
శారుశృంగారరసంబులధీరులౌ, రాయనుచుమెచ్చ హర్షంబు హెచ్చ
మొల్లపువ్వులపొట్లములువిప్పినట్లు, చల్లగావన్నీరుచల్లినతీరు
పరగుసరస్వతీపరిణయంబనెడు, సరసనాటకములాస్యములరంజిల్లి
భావముల్ తగువేషభాషాదులమర, గావించెభరతులుగాయకుల్ మెచ్చ
ఆచక్రవాళాచలాచలాచక్ర, మాచంద్రతారార్కమైయొప్పుగాత.

End:

వాణికిపల్లవపాణికివీణాప్రియకవివేణికిని, ఏణనయనకునెలమిపద్మజునిరాణికిశ్రీ
కల్యాణికిని, భోసలశాహజిభూవిభునిభాసిలుప్రేమనుపాలించు, వాసిగశోభన
వైభవసంతతిధీసంపదలిడుదేవునకు, సకలజగములకుసంతసముఅకలంకాప్త
తనమరించు, సుకృతికిసంతతిశోభననిధికిని అకలుషమతియగుఅజునికిని ॥ శో
భానమె.

Colophon: Nil.

S. సరస్వతీకల్యాణము.

R. సమగ్రము. వ్రాతయొకతీరు. తప్పులుకుప్పలు. శైథిల్యగ్రంథపాతములులేవు.
తొలిపత్రముమార్జినులోనిట్లున్నది. "వెంకటక్రిష్ణయ్యవ్రాశినది."

This work is Sarasvatīkalyāṇamu, by Śeṣācalapati who however surrendered his authorship to Śāha Mahārāja.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 652. | M. | 516 | 15×1½ | 46 | సమగ్రము. |
| 653. | ,, | 611 | 20×1 | 50 | అసమగ్రము. |
| 654. | ,, | 612 | 19×1 | 49 | సమగ్రము. |
| 655. | ,, | 613 | 22×1 | 28 | ,, |
| 656. | ,, | 614 | 16×1¾ | 17 | ,, |
| 657. | ,, | 7 | 9½×4 | 60 దేవనాగరిలిపిలోనున్నది. | ,, |

R. 652. "లేఖరి వెంకటరంగయ్య" యనిగలదు.

653. మంగళాష్టకములు తుది గలవు. ఆదిపత్రమువినష్టము.

656. ప్రతితుదిపత్రముననిట్లున్నది. "వెంకటనృశింహాలిఖితం కరకృత మపరాధం క్షంతుమర్హంతిసంతః.వ్రాలాశబ్దరతప్పులుచాలాగలవేన్నశబ్దసంగతులెరుగక, గేలింబెట్టకనవ్వక పాలించుడిప్రాజ్ఞులెల్లబహుమతితోడక."

No. 656. The scribe's name is Veṅkaṭanṛsimha.
No. 657. This is a Paper Manuscript.

## 658–662. సర్వాంగసుందరీవిలాసము. (గిరిరాజు).

SARVĀṄGASUNDARIVILĀSAMU. (Girirāja.)

M. 555; S—16½×1½; L—14; Il.—6; G—336.

Beginning :

తోడెం. నాటరాగం. జంపెతాళం.

జయదేవకీపుత్రజయదివ్యనుతిపాత్ర, * * *

వ॥ ఈ విధంబున నభీష్టదేవతావందనంబుగావించి సభానాయకుల నభివర్ణించి సర్వాంగసుందరీ విలాసంబనెడు నాటకంబు కథాక్రమంబుగావినుపించెదము, విననవధరించరయ్యా. * * *

అనియెడికథలచేనమరినశాహా, ధవునిసర్వాంగసుందరివివాహంబు
నవవైఖరులుమీరనాటకంబుగను, గరిమతోగిరిరాజకవిరచియించె
ధరణిలోనాచంద్రతారార్కముగను.

End :

సూ॥అవురాయీవిధంబునపలికినకన్నునశాహేంద్రుడులంగీకారముచేసినభావం
తెలిసివద్దనున్నచెలులుమంగళంబుపాడేమార్గం పరాకు. మంగళం మహేంద్ర

శాహరాజాయమంగళం నిత్యం. మహితకల్యాణాయ మంగళం భోగదేవేం
ద్రాయ భోసలకులదీపాయ వాగీశపాండిత్యాయమంగళం. భూధరధైర్యాయ
భువనైకవీరాయ మాధుర్యనిలయాయ మంగళం. శ్రీచోళనాయకాయశ్రీవా
సుదేవకవివాచాసంతుష్టాయమంగళం.

Colophon: Nil.

S. సర్వాంగసుందరీవిలాసనాటకము.

R. సమగ్రము. వ్రాతయొకతీరు. తప్పులుమెండు. శైథిల్యగ్రంథపాతములుకొద్ది.
"ఈ అలేఖమునందు యేషోనాటకంబైన సర్వాంగసుందరీ కల్యాణమహా
నాటకముసంపూర్ణమగునట్టుగా వ్రాశిన తాటాకులు ౧౮ మంత్రమూర్తి
వెంకటరంగయ్యచేతివ్రాలు శ్రీరామచంద్రాయనమః." అనిచివరనున్నది.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 659. | M. | 556 | $14 \times 1\frac{1}{7}$ | 14 | | సమగ్రము. |
| 660. | ,, | 32 | $9 \times 5$ | 36 | నాగరిలిపి. | ,, |
| 661. | ,, | 558 | $16 \times 1\frac{3}{4}$ | 8 | | ఆద్యంతరహితము. |
| 662. | ,, | 557 | $18 \times 1$ | 21 | | సమగ్రము. |

R. 657, 658, 661. పాఠభేదములుపెక్కులుగాననగు.

660. లేఖనసమాప్తిపుష్యశుద్ధప్రతిపదాస్థిరవాసరతంజాపుర్యాంతారణాబ్దేలిఖితం.

662. పైవానికినిదీనికినాదిమంగళముభేదముగానియుంతకంటెభేదములేదు.

No. 660. The date of transcription is Saturday the first day of the bright fortnight of the Puṣya month in the year Tāraṇa.

## 663–672. సీతాకల్యాణము. (శాహ మహారాజు.)

SITĀKALYĀṆAMU. (Śāhamahārāja.)

M. 515; S—10×1¾; L—26; ll.—5; G—325.

Beginning:

రామంశ్యామాభిరామం రవిశశినయనం కోటిసూర్యప్రకాశం
దివ్యందివ్యాస్త్రపాణింశరముఖశరధించారుకోదండహస్తమ్ ।
కాలంకాలాగ్నిరుద్రంరిపువనదహనంవిఘ్నవిచ్ఛేదదక్షం
భీమంభీమాట్టహాసంసకలభయహరంరామచంద్రంభజేహమ్ ॥

తోడి॥ నాటరాగం. ఝుంపెతాళం.

జయదశరథపుత్రజయదివ్యనుతిపాత్ర, * * *

జయజన్మైకమహీతలేశ్వరతనూజ, జయజయోదారభోసలశాహరాజ.

సూ॥ వ॥ అపురాయీవిధంబున నభీష్టదేవతావందనంబుగావించి సభానాయకా

దులనభివర్ణించిశ్రీశాహమహారాజప్రణీతంబైనసీతాకళ్యాణంబనెడునాటకంబు

కథాక్రమంబుగావినుపించేము, విననవధరించరయ్య.

End:

మారామభద్రునికిమంగళం, నిత్యంమాసీతాదేవికిమంగళం, వనజాతనేత్రునికి

వరకీరవాణికి, మనసిజరూపునికిమంగళం, భానుకులేశునికి, పరమకళ్యాణికి,

మానవేంద్రునికిని మంగళం, విహగవాహనునికి, విరిబోణికి శ్రీశాహ మహీ

పాలునిదేవునికిమంగళం. సీతాకల్యాణంనాటకంసంపూర్ణం.

Colophon: Nil.

S. సీతాకల్యాణనాటకము.

R. సమగ్రము. వ్రాంతచక్కనిది. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాఠములులేవు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 664. | M. | 530 | 16×1¾ | 12 | | సమగ్రము. |
| 665. | ,, | 531 | 15×1¾ | 27 | | ,, |
| 666. | ,, | 532 | 10×1 | 16 | | ,, |
| 667. | ,, | 533 | 18×1 | 19 | | ,, |
| 668. | ,, | 534 | 15×1¾ | 59 | | ,, |
| 669. | ,, | 535 | 15×1½ | 50 | | ,, |
| 670. | ,, | 536 | 17×1 | 64 | | ,, |
| 671. | ,, | 11 | 8×4 | 18 | నాగరిలిపిలోవ్రాయబడెను. | ,, |
| 672. | ,, | 12 | 9×5 | 108 | ,, | ,, |

R. Nos. 671, 672. These are Paper Manuscripts.

## 673. సీతాకల్యాణము.

SITĀKALYĀṆAMU.

M. 708; S—9×1¼; L—37; ll.—8-9; G—650.

Beginning:

గణాధిపతయేనమః.

క॥ తిరముగనచ్యుతపురమున, గరిమెనుసీతాపరిణయకథచరితములక
ధరలోనాటకముగనే, విరచించెదకవులుచాలవినుతింపగను.

End:

కుంభకాంభోది. ఆది.

మునిచంద్రుతోవరసౌమిత్రికిఊర్మిళనిపదమొనరగనిపుడు.

Colophon: Nil.

S. సీతాకల్యాణము.

R. అసమగ్రము. వ్రాతమంచిది. తప్పులులేకపోలేదు. గ్రంథపాతశైథిల్యములు స్వల్పముగానున్నవి. దీన మఱికొన్నిగ్రంథములు భాషాంతరములకుఁజెందినవి గానగును. ఇదిగ్రంథలిపిలోవ్రాయఁబడియున్నది. కర్త తెలియదు.

The author's name is not to be found. The Ms. is incomplete.

---

## 674. హేమాబ్జనాయికాస్వయంవరము.

(మన్నారుదేవుఁడు.)

HĒMĀBJANĀYIKASVAYAMVARAMU. (Mannārudēva.)

M. 675; S—17×1½; L—40; ll.—6; G—960.

Beginning:

శుభమస్తు.

సీ॥ శ్రీరమణీసముజ్జృంభమాణకటాక్ష, హారమణిలసద్వ్యారివక్ష
వార్తాచమత్కారవైభవప్రదనామ, మార్తాండమండలమహితధామ
మాణిక్యకేయూరమండితభుజదండ, చాణూరగర్వశిక్షాప్రచండ
తంజాపురాధిపస్తవనీయచారిత్ర, కంజాతపత్రసంకాశనేత్ర

తే॥ ద్వారకాధీశకాంచనవసనివాస, పాకరిపుమిత్రచంగమలాకళత్ర
మముగటాక్షించిశుభలీలమనుపుజాల, రాజగోపాలరాధికారతివిలోల.

* * *

వ॥ అనివినతులొనర్చి యనంతగరుడులకనంతనమస్కారంబు లాచరించిపంచా
స్త్రజనకుని పంచాయుధంబులనుతియించి, వన్నెమీఱపన్నిద్దరాళ్వారులనిత్య

సూరులనారాధించియాదిమకవుల నాదరించి, కుకవిలోకంబునిరాకరించి, అతు
లితాశ్చర్యతపశ్చర్యులగుశతక్రతుశ్రీనివాసతాతాచార్యులకుగంభీరసూక్తుల
సంభావన మీారనమస్కరించి, నిజవంశకర్తయైవార్తకెక్కుచెవ్వభూభర్తను
గీర్తించి, తనదుప్రపితామహునిమహామహునివీరవైష్ణవసార్వభౌమునియచ్యు
తాళ్వారులనభినుతించి, తనదుపితామహునియభినవభోజునిరఘునాథజననాథ
బిడౌజునిసన్నుతించి శాశ్వతైశ్వర్యంబుల వెలయుచు, విశ్వవిశ్వంభరాచక్రం
బాచంద్రతారార్కంబుగాఁ బాలింపుచు, చాల వర్ధిల్లుచున్న తన తండ్రియగు
విజయరాఘవభూపాలచంద్రుని యుదారపదారవిందంబులకు వందనంబు
గావించియతనియనుమతింగాంచి * * * మహితాను
భావుండునునగుమన్నారుదేవుండు భువనస్తవనీయంబుగావర్ణించుశృంగార
రసగర్భసందర్భవిభాసురంబగు హేమాబ్జనాయికాస్వయంవరంబను నాటకం
బునకుఁగథాసంవిధానంబెటువలెను.

End:

ఇవ్విధంబున వివాహమహోత్సవంబవధరించి సరక్తాబ్జనాయికారాజగోపాల
కులజలధిరాజు చేఁబూజలంది దక్షిణద్వారకాపురంబుకన్న దాపురంబైసకలసం
పత్పరంపరలనికరంబగుతంజనగరంబు చేరవచ్చి తమముద్దుబట్టియగు విజయ
రాఘవపట్టభద్రుండుసవరించు వివిధోపచారంబుల నుల్లసిల్లుచునతనికిదీర్ఘాయు
రారోగ్యభాగ్యంబులుశాశ్వతైశ్వర్యంబులఁ బాలింపుచు * * *
మంగళముసంపంగిమన్నారుదేవునకు, మంగళముమహితానుభావునకును
మంగళముసరిలేనిబంగారుబొమ్మకును, మంగళముచక్కనిచెంగమ్మకు
జయమంగళంశుభమంగళం.

Colophon:

భరతవాక్యం.

ఇవ్విధంబున చిన చెవ్వయచ్యుతాధిపప్రపౌత్రుండును రఘునాథజననాథపౌత్రుం
డును విజయరాఘవభూపాలకప్రియపుత్రుండును రాజగోపాలాంబికాగర్భ
కలశజలధికువలయమిత్రుండును, అతులకనకతులాప్రముఖనిఖిలమహాదాన
దీక్షాధురీణుండును, అనేకాగ్రహారప్రతిష్ఠాపనప్రవీణుండును, విజయరాఘవా
భ్యుదయాది ప్రబంధనిబంధనచాతురీ ధౌరేయుండును, అతులితపితృ భక్తిగురు

భక్తిభాగధేయుండును మహితానుభావుండునగుమన్నారుదేవుండు భువనస్తవ
నీయంబుగావర్ణించిన హేమాబ్జనాయికాస్వయంవరంబను నాటకంబునకు
కథానాయకులగురక్తాబ్జనాయికా రాజగోపాలకులుతమప్రియపుత్రుండైధాత్రి
పాలింపుచు చాలవర్ధిల్లుచున్న విజయరాఘవభూపాలునకు సర్వసర్వంసహాధి
పత్యనిత్యాయురారోగ్యభాగ్యంబులుపాలించిరక్షింతురుగాత.

S. హేమాబ్జనాయికాస్వయంవరము. మన్నారుకొలువుండగా నొకనాడు దేవ
తలువచ్చివానితో సముద్రమథనవిషయమువిన్నవించిరి. మన్నారపుడువెడలి
పాలమున్నీటఁబుట్టినయమృతంబుదేవతలకొసఁగి సముద్రునికన్యయగురక్తాబ్జ
యనునాపెను వివాహమాడెను. ఈకథ యిందువర్ణితము.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులులేవు. శైథిల్యగ్రంథపాతములులేవు.

This work is Hēmābjanāyikāsvayamvaramu by Mannārudēva the son of king Vijayarāghava Nāyak. The author refers herein to another production of his Vijayarāghavābhyudayamu, which is however unfortunately lost to us.

## 675. ఉత్తరగోపురము.

### UTTARAGOPURAMU.

M. 397; S—13⅜×1¼; L—12; ll.—5, 6; G—144.

Beginning:

వ॥ అయ్యవసరంబునదశకంధరుండును..........చలంబునరాఘవేశ్వరుండ
బ్ధిదాటిమర్కటబలంబులతోవచ్చివిడిసెననిశుకచారులునాకుంజెప్పిరి * *
ఉత్తరగోపురంబుచూచి రామబలంబులను సేనాధిపతులను రామలక్ష్మణుల
నుజూడనపేక్షించిరథంబుడిగ్గియా గోపురంబెక్కియింద్రజిత్తు అతికాయాదికొ
మారులునుభయపార్శ్వంబులనుండప్రహస్తాదిమంత్రులు వినంగ శుకచారులం
బిలిచి.

End:

ఇంద్రజిత్తుండాడిన వినిరావణుండతండె ధర్మి అతండె కారుణ్యచిత్తుండతండు
కృపామూర్తిగాగ ఆశరంబుఆపట్టధ్వజంబులపై దెంచెగాక మరియించుకవంచి

యేసినమనయుద్దరిశిరంబులుంబోవు * * రాముగుణపౌరుషంబులుమన మునఁదలపోయుచుచింతింపుచుండెనయ్యవసరంబున.

Colophon : Nil.

. ఉత్తరగోపురము. ఈగ్రంథమునరావణుండుతనయుత్తరగోపురంబెక్కి రాముని సైన్యమునుగనిచింతించుటయనునది ప్రతిపాదనీయాంశము.

. సమగ్రముగాదు. తప్పులుగలవు. వ్రాఁతయొకమాదిరిది. శైథిల్యముగలదు. గ్రంథపాతముంజూపట్టు. గ్రంథకర్తతనపేరునుజెప్పియుండలేదు. " పరీధావి సంవత్సర మార్గశిర బ ౭ లు నారాయణవనం కుప్పయవాధ్యారిగారుబిల్ల సోమయకుమారుడుబాలయకు ఉత్తరగోపురం సాంగంగాను వ్రాశేను " అని గ్రంథముతుదినివ్రాయఁబడియె.

The scribe's name is Nārāyaṇavanam Kuppaya Vādhyār.

This work is Uttaragōpuramu of unknown authorship. The story of the despondency of Rāvaṇa when he looked at the mighty army of Rāma from his northern tower (Uttaragōpura) is described here.

## 676–677. ధేనుమాహాత్మ్యము. (తిరుకామ కవి.)

DHĒNUMĀHĀTMYAMU. (Tirukāma Kavi.)

M. 278 ; S—16×1$\frac{4}{8}$ ; L—59 ; ll.—3-4 ; G—708.

Beginning :

వ॥ సత్యలోకంబుననివియజ్ఞసంగతినివసించు. హోమామమ్ములకెల్లను వీనిపాలు చేచమురునుపయోగించు. కొమ్ములునెమ్ములుచర్మములునున్ననితోంకనున్న రోమములుపేండ పంచితమ్మునునన్నింటికి నుపకరించు. గాలిని చలిని ఎండను వీంటికిబడలిక లేదుగావున నాయాసమయమ్ములతమకనుచితమ్ములైనపనులివి చేయు. కావున నావులు బ్రాహ్మణుండును నేకతత్వమ్ముగుటఁజేసి పరమపదమ్ము జెందునందునగోబ్రాహ్మణులుసమానవస్తువులని పెద్దలుపలుకరింతురు. రంతిదే వుండనురాజు యజ్ఞంబున * *

ఆవులపా లమృతంబని అమరవిభుండుపలుకరించెగనక ఆవునిచ్చిన అమృత

మిచ్చినఫలముచేకూరును. మేఫుతోఁగూడ మేలైనదూడఆవునువృషభమ్మును నెవ్వండొసంగునతండుస్వర్గంబునందుసుఖంబుఁజెందు. ప్రాణంబులు ధేనువులు సమంబులనిమునులుపలుకరింతురు. కాఁబట్టిగోదానంబు చేయుజనులకుఁబ్రాణ దానఫలంబుకలుగును.

End:

ఇతరధర్మంబులు దానంబులు తీర్థయాత్రలుసేసినందువల్లనింత అతిశయమైన ఫలములుదొరకదు. కావుననావులమహిమలెన్నవలవిగాదు * * పుత్రపౌత్రాభివృద్ధినికలిగిఆచంద్రార్కముసుఖానసుందురు.

Colophon:

చ॥ వివిధకలాకలాపఖనివెంగనలింగమఖేంద్రునాగన
త్కవితిరుకామకోవిదశిఖామణిధీరులుపాకవైరిలో
కవికచకల్పకస్తబకగంధధురంధరసూక్తియుక్తినా
నవుననిమెచ్చనావులమహాత్మ్యమొసర్చెనుతేటమాటలన్.

S. ధేనుమాహాత్మ్యము. ధర్మరాజునకుభీష్ముండుగోమహాత్వంబును దెల్పుటదీని యందువర్ణింపఁబడియె.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములధికము. ముఖపత్రములేదు. ఆశ్వాసవిభాగమునుగాన్పింపదు.

This work is Dhēnumāhātmyamu by Tirukāma Kavi. The holiness of the cow is revealed herein to Dharmarāja by Bhīṣma. This does not contain the beginning of the work which is fortunately preserved to us in No. 677.

677. M. 279 19×1⅓ 35

Beginning:

శా॥ శ్రీరామామణివింతగానురమునంజెన్నొందికొల్వుండనెం
తేరంగంబునుకట్టుమట్టునసదాదీవ్యత్కృపాధారక్షీ
రారూఢిందగకామధేనువువలెన్ రక్షించిలోకంబులో
శ్రీరంగేశుఁడుచొక్కనాథ... శౌరిక వేడుకన్ బ్రోవుతన్.

వ॥ శ్రీవెలయనఖిలధర్మంబులు భీష్ముండుధర్మరాజునకు ననుగ్రహింపుచు నిఁకను శాశ్వతసంకృతనిదానంబగునీశ్వరుండావులతోడతపంబుచేసె. కావుననయ్యా

వులధికతపంబులుచేయు తపసులకంటెమిక్కిలి యెక్కుడగునవి. వీనిమహిమకు మేరగలదే. సత్యలోకంబుననివియజ్ఞసంగతినివసియించు.

End & Colophon : పూర్వమువలె.

R. సమగ్రము. వ్రాంతరోంత. తప్పులుకుప్పలు. శైథిల్యగ్రంథపాతములుకొద్ది. పత్రములు తాటిమాటిగానున్నవి.

## 678. నారదగర్వభంగము.

NĀRADAGARVABHANGAMU.

M. 617-a ; S—16½×1¼ ; L—9 ; Il.—6-7 ; G—252.

Beginning :

వ॥ ద్వారకానగరమందు శ్రీకృష్ణస్వామి రుక్మిణీసత్యభామాసమేతుండై యుండే సమయమందునారదుండు శ్రీకృష్ణదేవునియొక్క దర్శనార్థమైరాగానుదవ్వులను వచ్చేనారదమునిఁజూచియెదురుగాపోయిపట్టితోడితెచ్చిఆసనార్ఘ్యాదిపూజలను సంతుష్టునిఁజేసియిష్టాలాపములుగా వార్తలాడుకొంచునుండే సమయమందు దేవేంద్రునిసముఖమునుంచి దేవదూతవచ్చి శ్రీకృష్ణస్వామి సముఖమందున్న నారదఋషినిజూచి దేవేంద్రుండుపిల్చుకరమ్మనినాఁడు వేంచేయుమని పల్కరించగా * * తనకుసమానమైనవారులోకమందు లేరనియూహత్తు గర్వముదయించగా శ్రీకృష్ణస్వామిసర్వాంతర్యామిగనుక నారదమునిహృదయం తెలిసినవాఁడైవీఁడు గర్వయుక్తుఁడై యున్నాఁడు దేవసభకుఁబోయివచ్చిన పిమ్మటనువీని గర్వభంగముకావింతామనియెంచియున్నతర్వాత.

End :

నారదఋషికిఆనందకరమయ్యేటట్టివిశ్వరూపంచూపెను. * *
అఖిలాండకోటిబ్రహ్మాండనాయకా నమోనమో శ్రీమన్నారాయణా ఆర్త రక్షకా దేవాదిదేవా పరాత్పరమూర్తివై ననీమహిమబ్రహ్మాదులు తెలియవే.

Colophon : Nil.

S. నారదగర్వభంగము. వచనకావ్యము. దీనశ్రీకృష్ణభగవానుఁడు మోహినీ వేషముధరించినారదునిగర్వభంగంబు సేయుటప్రతిపాదింపఁబడియె.

R. అసమగ్రము. గ్రంథము తుదిభాగ మల్పమే లుప్తమనితోఁచెడిని. వ్రాఁత చక్కనిది. తప్పులులేకపోలేదు. శైథిల్యముగలదు. గ్రంథపాతముగన్పట్టెడిని. గ్రంథనామముగాని తత్కర్తృనామముగానిదీనఁగన్పట్టుటలేదు. గ్రంథ శీర్షిక మాత్రమిట్లుగలదు. "నారదగర్వభంగంనాటకం" అని. ఇదినాటకమనుటకు దగియుండలేదు.

This work is Nāradagarvabhaṅgamu of unknown authorship. The colophon is not to be found.

## 679. పంచతంత్రకథ.

### PAÑCATANTRAKATHA.

M. 366; S—10¾×1¾; L—38; ll.—7; G—550.

Beginning :

క॥ శ్రీరమణీకుచభరయుగకస్తూరీకుంకుమపటీరశోభితవక్షున్
నీరజపత్రనిభాక్షున్, శ్రీరాము మహితనాము సేవింతుమదిన్.

వ॥ అని శ్రీరామభద్రునితలంచిపంచతంత్రియనుప్రబంధంబు శ్రీవిలసిల్లువాక్యరూపంబుగావిన్నవించెద నదియెట్లనిన :—పాటలీపురమేలేరాజు సుదర్శనుండనే వాఁడు. ఆయనకుమాళ్లు విద్యావంతులుంగాక రాజ్యమున్ను జేయనేరక అవివేకులైయుండగాఁజూచిబుద్ధిలేనికొమాళ్లుపదివేలుక నేఅంతకన్నా వివేకిఅయిన కుమారుఁడొక్కడేచాలుననిక స్తిపడుచున్న రాజునుఁజూచి.

End :

నీవెవ్వండ వెక్కడికిబోవుచున్నావనంగాను దొంగను తిప్పా వొర్ఘులయిం టనేఆవులదొంగిలించబోచున్నాను. ఇద్దరముగూడాపోదామురమ్మని బ్రాహ్మణుని యింటివాకిటికిబోయినవెనక బ్రహ్మరాక్షసుండు దొంగనుఁజూచినను తిప్పావొర్ఘులనుపట్టినవెనకనీవుఆవులనుదోలుకపొమ్మనగాదొంగఆగ్రహించి నీవుపట్టినపుడే బ్రాహ్మణుఁడుమేలుకొనును. నేనావుల దోలుకపోయినవెనుక నీవుపట్టుమనగాయిద్దరికిన్ని జగడమైకొంతలుబెట్టగా.

Colophon : Nil.

S. పంచతంత్రకథ.

R. సమగ్రముగాదు. వ్రాతచక్కనిది. తప్పులుగలవు. శైథిల్యమధికము. గ్రంథపాతముగాననగు. కీటకదష్టము. గ్రంథకర్తృనామమువ్యగ్యము.

This work is Pañcatantrakatha of unknown authorship. This is evidently based upon the same work in Sanskrit. The Ms. is incomplete.

---

## 680. బంగారుతిమ్మరాజుకథ.

### BAṄGĀRUTIMMARĀZUKATHA.

B. 11522-b; S—17$\frac{3}{10}$×1$\frac{4}{10}$; L—7; ll.—4-6; G—60.

Beginning :

వ॥ తురుకాతోపప్పె దినముల నెను దేశము పెనగొంటబాధకపన్నెండు దినముల నెడు పాళిము ప్పెనకొంట భూమికిముద్ర వెట్టింటయ్యనాయలు పెనకొంటాలోరా యలు దేవడుకమ్మరాయమన్యుసుడుశుక్రారమునా డెరాజుకొలువునకూచుంట

*　　　*　　　*

నవమినాడుతంత్రిముఖమునలిప్పకచూచెబంగారుతిమ్మరాజు.

End :

క్రమముల్లె నచదివిజూ సెనె.ఎలనాగతో కాష్టములోనఁబెట్టినాదిబంగారుతిమ్మ రాజుకూడిమైనతోప్పించానే యెలనాంగసీతా అత్తలుకోడలు ఇందురుగూడి గుండానదుమికిరి.

Colophon : Nil.

S. బంగారుతిమ్మరాజుకథ.

R. అసమగ్రము.వ్రాతచక్కనిదే. తప్పులుకుప్పలు.గ్రంథపాతశైథిల్యములున్నవి. కథ స్పష్టముగాలేదు. ఈప్రతిలోఁగొన్ని సంస్కృతగ్రంథములుగాననగు. ఇది గ్రంథలిపిలోనున్నది.

The author's name is not to be found and the story is not quite clear.

## 681. వచనభారతము. (శాంతి.) (నారాయణయ్య.)

### VACANABHĀRATAMU. (ŚĀNTI.) (Nārāyaṇayya.)

*M. 109; S—14⅜×1¼; L—150; ll.—4; G—1800.*

*Beginning:*

మఱియునజాతిశత్రుండుగాంగేయునవలోకించి బ్రహ్మచారియుగృహస్థుండును వానప్రస్థుండును........ఫలంబులనభిలషించి యే దేవతలనర్చనంబు గావింపవలయు. సృజియింపంబడనిపరమనస్తు వెయ్యది. దేవగణంబులకుం బితృవర్గంబులకునుజనకుండు దేవుండు. ఈసకలప్రపంచంబునకు సృష్టియెవ్వానివలనఁ గలుగు. ఎవ్వానివలనస్వర్గంబునుముక్తియుఁగలుగు. ముక్తుం డెట్టిసద్గతింగాంచును. మోక్షస్వరూపం బెయ్యది...... .

**End:**

పుణ్యంబగునీకథభార్గవచ్యవనుండుజనకుండను రాజర్షికి నుపదేశించె........ నారదుండును దేవేంద్రునకుఁ దెలిపె. ఆసహస్రాక్షుండునువసువులను దేవతలకు ...............తనకును యుద్ధంబైన యవసరంబుననాకుం దెలియ వివరించిరి. నేనునీకుయథార్థంబుగానుపదేశించితి. పుణ్యంబైనయీయుపాఖ్యానము విన్నవారలకునుబఠించువారలకును బాపంబుల నెల్ల నెడలించి ఆయురారోగ్యైశ్వర్యంబులనిచ్చు. ఈశాంతిపర్వంబెల్లవినినపురుషుండాచార్యునికిదక్షిణసహితంబుగాశయ్యాదానంబుగావించివిభవానుసారంబు...

**Colophon:**

అనఃనీకథశాంతిపర్వంబున నారాయణీయంబునందు నూటయెనుబైమూఁడో అధ్యాయము. (పుట 14.)

ఈకథశాంతిపర్వంబున మోక్షధర్మంబునందు నూటయేభైయెనిమిదో అధ్యాయము. (పుట 298.)

R. సంపూర్ణముగాదు. వ్రాఁతతప్పులు లేవని చెప్పవచ్చును. గ్రంథపాతశైథిల్యములు లేకపోలేదు. అధ్యాయముల తుదిగద్యములు పైనఁజూపినట్లు రెండువిధములనున్నవి. ఆద్యంతములున్నట్లు లేవు.

The Ms. is incomplete.

# 682. వచనభారతము. (ఆనుశాసనిక.)

(తుపాకుల అనంతయ్య.)

VACANABHĀRATAMU. (ĀNUŚĀSANIKA.) (Anantayya.)

M. 110; S— ; L—147; ll.—4, 5; G—2105.

Beginning:

యుధిష్ఠిరుండును, పితామహాలోకంబునఁబురుషులకునాయుష్యంబు నూరుసంవత్సరంబులనియును, అంతిపర్యంతంబునకు తేజంబుకలిగియుండుననియును, వినంబడుచున్నయదియట్టులయ్యెను కొందఱుబాల్యంబునందయేమిటికి మరణంబుచెందెదరే. ఏకర్మంబువలనదీర్ఘాయుష్యంబులును, ఏకర్మంబువలననాయుర్విఘాతంబునుంజెందుదురు. తపంబును బ్రహ్మచర్యంబును జపంబును హోమంబులును మహాకులసంభవంబును సదాచారంబును ననువీనిలోననేమిశేయశోలాభంబునునైశ్వర్యంబును బడయుదురెరింగింపుమనిన మందాకినీనందనుండునునీ ప్రశ్నంబులకుసదుత్తరంబునొసగెదధర్మనందనా.

End:

అనినయుధిష్ఠిరుండుగాంగేయుంగనుంగొనిలోకంబుననవశ్యంబు నెఱుంగదగిన ధర్మంబును మహాత్ములగువారలకు నాచరిపదగినయర్థంబునిట్టిదనిసకలశాస్త్రసారంబుగనాయందుఁగలయనుగ్రహవిశేషంబుననీ వెఱింగింపవలయుననిన.

*    *    *

తొలుతపుండరీకుండనునొక్క మహానుభావుండు నారదమునీంద్రుంగనుంగొని తనశ్రేయస్కరంబగు    *    *    నారంబులయునంబుగాఁ గలయతండునారాయణుండు. అట్టినారాయణు..................

Colophon:

ఇతిశ్రీమదుభయభాషాసాహిత్యభోజచంద్రగిరికృష్ణనృపతనూజ సాంద్రతేజోవిశాలతుపాకులయనంతభూపాలప్రణీతంబైన శ్రీమహాభారతవచనకావ్యబునందాను శాసనిక పర్వంబునందునరుపై రెండో అధ్యాయం.

R. అసమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులుకొద్ది. శైథిల్యముకలదు. గ్రంథపాతములున్నవి. కొన్నిస్థలములయందుఁగవివంశావళి వ్రాయఁబడి యుండలేదు. అంతమునఁగొని పత్రములు లేవు.

This work is Ānuśāsanika Parvamu by Tupākula Ananta Bhūpāla, the son of Kṛṣṇanṛpa. The Ms. is incomplete.

## 683. భారతచిల్లరకథలు.

## BHĀRATACILLARAKATHALU.

M. 114; S—14×1¼; L—116; ll.—6; G—1784.

Beginning:

...భీమార్జుననకులసహదేవులు......భార్యాసమేతులై అశుచిపరిహారము కొఱకు గంగాతీరమునందిసుకతిన్నె మీఁద........................
రాజులుయాగాలుదానధర్మాలు అధ్యయనంప్రజాపరిపాలనందుర్జనశిక్షభయ పడకశత్రులందునుమట ఇది రాజధర్మమనంబడును. అధ్యయనమున్ను దాన ధర్మాలున్ను న్యాయమార్గానబేరమాడుటగోరక్ష సేయుటఇది వైశ్యునిపద్ధతి. ఈబ్రహ్మక్షత్రియవైశ్యులకుశుశ్రూష చేసిపంచినపనులాచరించేది రాజుయేలిక లేకధనధాన్యాదులుగూర్చుమిశూద్రపద్ధతి.

End:

నిత్యముసంతుష్టుఁడైన సత్యవంతునిజూచి దేవతలుసుప్రీతిం జెందుదురు. అందు వల్ల మిగులసంతోషముగద్దు. అసంగా జాబాలియనేవాడు నీవుకులాచార ధర్మముమానకవున్న కారణమున మెద్దియనంగా వినుము ధర్మమందాసక్తికల్గి దుర్జనసాంగత్యముచేయకకళంకరహితుండయియుండేవాడెదుష్కర్ముడు...

Colophon: Nil.

R. ఆద్యంతములులేవు. వ్రాఁతచక్కనిది. గ్రంథముకీటకదష్టము. "నాలుగోఆశ్వాసము. అయిదోఆశ్వాసము" అనియిట్లాశ్వాసాంతముల గన్పట్టును. కవినామాదికములెక్కడను లేవు.

This work is Bhāratacillarakathalu of unknown authorship. The beginning and end are not to be found.

## 684. భేతాళపంచవింశతి.

## BHĒTĀḶAPAÑCAVIMŚATI.

M. 176; S—10$\frac{2}{10}$×1$\frac{2}{10}$; L—68; ll.—5; G—600.

Beginning :

మొదటికథ.

వ॥ గాంకృతమను పట్టణముకలదు. ఆపట్టణమునేలేరాజు పేరు ప్రతాపముకుటుండు. ఆరాజకొమారుని పేరువజ్రమకుటుండు. ఆరాజుమంత్రికుమారుండుసద్బుద్ధనె వాఁడు. రాజకుమారుండైనవజ్రమకుటునివెంటబెట్టుకొనితామిద్దఱునువినోదముగాఁబయలుదేరి వేఁటమార్గముగావచ్చియొకవనముప్రవేశించి మొదట.

End :

వ॥ అంతట నైదారుమాసములుపోగా భేతాళుండు విక్రమార్కునకు చెప్పినకథ సంపూర్ణం.

Colophon : Nil.

S. భేతాళపంచవింశతి.

R. సమగ్రము. వ్రాఁతరోఁత. తప్పులతడక. శైథిల్యములేకపోలేదు. గ్రంథపాతములులేవు.

This work is Bhetāḷapañcavimśati of unknown authorship. This is evidently based upon the same work in Sanskrit.

---

# 685. విక్రమార్కునికథలు.

## VIKRAMĀRKUNIKATHALU.

M. 361; S—16×1¾; L—60; Il.—8; G—1920.

Beginning :

వ॥ కైలాసనగమందు పార్వతీపరమేశ్వరులు వివాహముచేసేవేళ పార్వతీదేవిపరమేశ్వరులజూచి లోకరహస్యమైన శృంగారరసభరితమై వుండేటట్టుగానొక్క కథఆనతియ్యవలెను. అడిగినందులకు పరమేశ్వరులుపార్వతీదేవిని ఆదరించి భారతభాగవత రామాయణపురాణేతిహాససంహితాతాత్పర్యాది సకలధర్మ కథలున్ను మునుపే తెలిపినారంకనక ఇఁకను కలిరాజ్యమైన భూలోకమందు జంబూద్వీపమనివిలసిల్లిన పుణ్యద్వీపమందలిన రేంద్రుంఁడుచప్పన్న దేశాలుయేలినవిక్రమార్కుఁడెక్కిన సింహాసనానుండిన ప్రతిమలుచెప్పిన కథలు కొన్ని కలవు. అవివివరించెదమువినుమనంగా కాత్యాయనికడువిస్మయమంది ఆకథలు ఆనతియ్యమనగావిహూపాత్రుండువి సరించేవిధము.

**End:**

వ॥ మనోహారిణి వసంతకుసుమ అనుముప్పైయిద్దరున్ను పరిచారము చేసుకుంచు
నుండగా పరమేశ్వరుడు కుమారజంగమవేషం వేసుక మాకు మోహాముపుట్టిం
చంగా ఆసన్న పార్వతీదేవి యెరిగి మమ్మున కోపించుకొని ఇంద్రునిసింహాసనాన
ప్రతిమలై వుండుమని శాపమియ్యంగా మేము వెరచి మాకు శాపమోచన మెప్పుడు
అనిఅడిగినందులకు విక్రమార్కునితర్వాత భోజుఁడు సింహాసన మెక్కవచ్చును.
అప్పుడు ముప్పైయిద్దరున్ను ముప్ఫైరెండు కథలు చెప్పినప్పుడె శాపవిమోచన
మవును. అనంగా యిన్నాళ్లువుండి యిప్పుడు నిన్ను శాపవిమోచన మాయెను.
మేము పార్వతీదేవిసముఖానకు పొయ్యేము. నీవు సుఖాన రాజ్యమేలుమని పల్కి
మేము వెళ్లిపోయినప్పుడె సింహాసనము దేవేంద్రునివద్ద చేరెను. భోజుఁడు రాజ్య
మేలుతా వుండెను. కనక యీకథ యెవ్వరు చదివినాకాని విన్నాగాని వ్రాసిన
గాని ఆయురారోగ్యభాగ్యములు కలుగును.

Colophon: Nil.

S. విక్రమార్కునికథలు. సింహాసనమందలి ప్రతిమలు భోజునకు చెప్పినట్లుగా
ఈశ్వరుఁడు పార్వతికిఁ జెప్పుట.

R. సంపూర్ణము. వ్రాఁత చక్కనిది. తప్పులకుప్ప. శైథిల్యగ్రంథపాతములు లేవు.
కవి తెలియదు.

The author's name is not to be found.

## 686–689. వెంకటేశవిన్నపములు.

VEṄKAṬĒŚAVINNAPAMULU.

M. 435; S—10×1$\frac{3}{8}$; L—100; ll.—6; G—1800.

**Beginning:**

క॥ శ్రీరామరామయనుచును, యేమానవుఁడా యెనేటి యేర్పడ మదిలో
ఆరామవిభుని దలచిన, కారాకులు వొల్లినట్లు కర్మము వొల్లున్.

క॥ నారాయణ నీనామము, నారాయణ వ్రాయవయ్య నానాలుకపై
నారాయణ నినునమ్మితి, నారాయణ కావవయ్య నారదవరదా.

శ్రీవెంకటగిరిదేవా నాదేహంబునీవుండెడినిత్యనివాసంబు, నాజ్ఞానవిజ్ఞానంబులు మీయుభయపార్శ్వంబులదీపంబులు. నాముక్కు చమరలయూర్పులు మీయిరుదెసలంబట్టెడి యాలవట్టంబులు. నామనోరాగంబు మీకుచంద్రకావి వలువ. మీకుమ్రొక్కె నెత్తినచేతులు రెంకుసుమరకతతోరణంబులు.

End:

కలికావతారంబున దుష్టనిగ్రహంబును, శిష్టప్రతిపాలనంబును, వర్ణాశ్రమ ధర్మంబులు నిర్వహించుటయును, * * కర్తాభోక్తాజనార్దనయనుశ్రుతివచనప్రకారంబునంజేకొనినన్ను కటాక్షవీక్షణంబులనీదాసానుదాసునిగా నెంచినన్నురక్షింపుము. నమోనమో శ్రీవెంకటేశ్వరా.

Colophon: Nil.

S. వెంకటేశ్వరవిన్నపములు.

R. సమగ్రము. వ్రాంతచక్కనిది. తప్పులులేకపోలేదు. శైథిల్యముగలదు. గ్రంథ పాతంబుగన్పట్టు. గ్రంథకర్తృనామంబుమృగ్యంబు. గ్రంథాదిని నాలుగుపత్రములు పూర్వోక్తగ్రంథంబును, నటుపిమ్మటమూడుపత్రంబులు వెంకటేశ్వర అష్టోత్తరశతవిన్నపంబులునుంగలవు. "శ్రీవెంకటగిరిదేవా ౧ నందకాయుధధరా ౨ * * ఉభయవిభూతినాయకా ౧౦౭ అమృతమథనా ౧౦౮ మాయాశరీరధారి ౧౦౨ దేవనారాయణా ౧౦౩ హాటకగర్భా ౧౦౪ రమాకళత్రా ౧౦౫ యీఅష్టోత్తరశతవిన్నపాలు శ్రీవెంకటేశ్వరార్పణమస్తు."

This work is Veṅkaṭēśavinnapamulu of unknown authorship.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 687. | M. | 426 | $11\frac{1}{2}\times1\frac{1}{4}$ | 35 | అసమగ్రము. |
| 688. | ,, | 434 | $14\times1\frac{3}{4}$ | 18 | ,, |
| 689. | B. | 10812-a | $18\frac{4}{10}\times1\frac{8}{10}$ | 9 | ,, |

R. 688. తుదినిట్లున్నది. "వెంకటేశవిన్నపాలు తెనుఁగులిపి ఆకులు ౧౮ ట్కి అపూర్తి సుగంధిరామయ్యవ్రాసిన పు ౧ గ్రంథసంఖ్య 400 కబిలాకరో నెల 15 తేది."

The scribe's name is Sugandhi Rāmayya.

## 690–691. * కావ్యాలంకారసంగ్రహము.

(బట్టుమూర్తి.)

KĀVYĀLAṄKĀRASAṄGRAHAMU. (Baṭṭumūrti.)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 690. | M. | 187 | 16½×1⅝ | 86 | | అసమగ్రము. |
| 691. | ,, | 188 | 16½×1⅜ | 68 | 1—5 ఆ. | సమగ్రము. |

## 692–693. * కావ్యాలంకారచూడామణి.

(విన్నకోట పెద్దన.)

KĀVYĀLAṄKĀRACŪḌĀMAṆI. (Vinnakōṭa Peddana.)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 692. | M. | 335 | 18¼×1½ | 7 | అసమగ్రము. |
| 693. | ,, | 336 | 18¼×1½ | 37 | ,, |

## 694. * అనంతునిఛందము. (అనంతామాత్యుఁడు.)

ANANTUNICHANDAMU. (Anantāmātya).

| | | | | |
|---|---|---|---|---|
| M. | 332 | 19×1½ | 34 | అసమగ్రము. |

## 695–696. ఆంధ్రప్రయోగరత్నాకరము.

ĀNDHRAPRAYŌGARATNĀKARAMU.

B. 10008; S—19×1½; L—55; Il.—6; G—1678.

Beginning:

క॥ శ్రీభామానర్మోక్తిక, భాభవనిజమందహాసధాగధగశ్రీ
శోభితశుభతత్కుచకుం, భాభోగవిలాస వెంకటాచలవాసా.

సీ॥ శ్రీమదాదిమకవిశేఖరుల్ చెప్పిన, మునుపటిలక్షణమ్ములనుఛంద
ములుసూచితయుందులఁగలయన్ని యునుమరి, వారుగానని కొన్ని వగలఁగూర్చి
బాగుగానాంధ్రప్రయోగరత్నాకర, మనుకృతి సేసిదీననుమునుపట్టి
కావ్యాళిసుప్రయోగములెన్ని గలవన్ని, యురసిప్రామాణికమాటకతన

తే॥ సత్కృతులకెల్లనుపకారసరణిగాఁగ, వరుసవ్రాసితినివిమదివాంఛదెలియ
నాతఁడెమహాకవియనంగనవనిబరఁగు, పంకజాతాప్తనీకాశవెంకటేశ.

వ॥ అవధరింపుము పిన్నకోట పెద్దిరాజలంకారములో కందము, భీముని ఛందము,
లక్ష్యం

క॥ భాసురములగుచుసుకర, ప్రాసానుప్రాసదుష్కరప్రాసాంత్య
ప్రాసద్విప్రాసత్రి, ప్రాసములనషడ్విధములఁబరఁగుఁగృతులఁ.

End:

ప్రాతిశాఖ్యసూత్రం॥ అఘోషాదూష్మణః పరః ప్రథమోభినిధానః స్పర్శపరాత్త
స్పస్థానః॥ ఇందుకర్థము: అఘోషమైన ఊష్మకుస్పర్శపరాననుంటేయీరెం
టికిమధ్యే అవర్ణాదితకారము వచ్చును. అభిధానమనంగా ఆగమమనుట.
॥నహాకారః॥ హాకారముఊష్మగాదనిసూత్రము. హాకారఃఅఘోషోనభవతి
స్నాన అనేటప్పుడు అఘోషమైన ఊష్మసకారానకునకారముస్పర్శపరమున
నుండంగామధ్యేతకారమువచ్చి స్తానమనియుంటెను. దీనికివర్ణక్రమము.
సకారాభినిధానతకారనకారఆకారాః. * * నన్నయభట్టు
లక్షణసారం.

క॥ భువిప్రాసములకుయతులకు, నవిరళముగఁజెప్పినాఁడనాఖ్యలటువలెఁ
గవులనవలెకాదనువా,రవివేకులువాదమేలనయ్యల్పులతోఁ.

Colophon: Nil.

S. ఆంధ్రప్రయోగరత్నాకరము. ఇదియొక ఛందోవిషయప్రతిపాదకగ్రంథము.
దీనఁబూర్వులగుఛందోలాక్షణికులుచెప్పినలక్షణములు, నన్నయభట్టారకాది
పూర్వకవీశ్వరగ్రంథములలోనిలక్ష్యములుగూర్పఁబడియెను.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిదే. తప్పులులేకపోలేదు. శైథిల్యమల్పము. గ్రంథ
పాతమునట్లే. దీన గ్రంథకర్తృనామముగన్పట్టుటలేదు. కానియీగ్రంథకర్త
తాను, "సర్వలక్షణశిరోమణి"యనునొక గ్రంథమునువ్రాసినట్లా పద్యముల
దీనవ్రాసియున్నాఁడు.

This work is Āndhraprayōgaratnākaramu of unknown authorship. This is a compilation in prosody from the works of previous writers containing examples also extracted from previous authors.

696. B. 10009 19½×1½ 50 సమగ్రము.

## 697–698. కవిగజాంకుశము. (భైరవ కవి.)

## KAVIGAJĀÑKUŚAMU. (Bhairava Kavi.)

M. 339 ; S— ; L—9 ; ll.—5 ; G—180.

Beginning :

క॥ నక్షత్రగ్రహగణభూ, తాక్షరగుణదోషనిర్ణయంబొనరింపన్
దక్షులుదారిదిగాదని, శిక్షించినకన్నులెట్టఁజేతురుకుకవుల్.

క॥ కదుకుచులక్షణమెఱుఁగక, కొదుకుచువడిప్రాసనియతిగూడకమిన్నల్
వెదకుచుపదసంధులుచెడ, నదుకుచునటుగవితగూర్పనతఁడుంగవియే.

* * *

క॥ సేవించినధనపతిగా, దీవించినహాళంకరించితిరిగినభిక్షుం
గావించులక్షణజ్ఞుఁడు, భావింపసమర్థుఁడెన్నఁబనిలేదితరుల్.

* * *

గణాధిదేవతలు.

క॥ జగతిజలానలానిల, గగనసుధాకరసహస్రకరపరమాత్మల్
తగుపతులుమయరసభజ, సగణములకవియుఁబ్రమథనాథునిమూర్తుల్.

End :

రాశిగ్రహంబులెవ్వియనిన.

సీ॥ విభుఁడుమేషమునకువృశ్చికరాశికి, క్రూరస్వభావుఁడంగారకుండు
నాథుండుమిథునకన్యారాశులకుజనా, నందనుండగునిందునందనుండు
అధిపతిమీనబాణాసనరాశుల, కతులప్రభావుఁడయ్యమరగురుఁడు
రాజవృషాతులరాశులురెంటికి, పరగుతపోనిధిభార్గవుండు

తే॥ మకరకుంభములకుమార్తాండసూనుండు, పతిత్రివేదమూర్తిభాస్కరుండు
కర్తసింహమునకుఁగర్కోటకాధీశుఁ, డఖిలలోకాధీశుఁడమృతకరుఁడు.

Colophon :

మ॥ గణవర్ణాదులమేలుకీడుతెలియంగాఁజెప్పసాహిత్యల
క్షణదీక్షాగురుఁడైనగారనసుధీసంస్తుత్యుఁడత్యుల్లస
ద్గుణరత్నాభరణుండుభైరవకవీంద్రుండెందుఁదద్జ్ఞుల్ తనన్
బ్రణుతింపన్గవితాగజాంకుశముభూప్రఖ్యాతమొనరించగన్.

S. కవిగజాంకుశము.

R. సంపూర్ణము. వ్రాఁతమంచిదే. తప్పులుకుప్పలు. శైథిల్యగ్రంథపాతములు గన్పట్టవు. 698 నెం॥ ప్రతియందుగ్రంథాదిగూడఁగానవచ్చెడి. "మాతృకాధ్యానం" అనుశీర్షికక్రిందకొన్ని విషయములుగానవగు.

This Ms. does not contain the beginning of the work which is fortunately preserved in No. 698.

| 698. | M. | 340 | 15½×1½ | 6 | సమగ్రము. |
|---|---|---|---|---|---|

## 699—702. * కవిజనాశ్రయము. (వేములవాడ భీమన.)

KAVIJANĀŚRAYAMU. (Vēmulavāḍa Bhīmana.)

| 699. | M. | 337 | 15×1¼ | 19 | సమగ్రము. |
|---|---|---|---|---|---|
| 700. | ,, | 315 | 12×1¼ | 6 | అసమగ్రము. |
| 701. | ,, | 331 | 18½×1½ | 60 | ,, |
| 702. | ,, | 334 | 14½×1 | 15 | ,, |

R. 701. కొన్ని పద్యములకర్థము వ్రాయఁబడె.

---

## 703. కవివాగ్బంధనము. (తిక్కన సోమయాజి.)

KAVIVĀGBANDHANAMU. (Tikkana Sōmayāji.)

M. 342; S—16½×1¾; L—6; ll.—6; G—120.

Beginning:

క॥ విద్యలలోపలనుత్తమ, విద్యకవిత్వంబుమఱికవిత్వముఛందో
వేద్యముగావునఁజెప్పెద, హృద్యంబుగఁగవితఛందమేర్పడఁగృష్ణా.

* * *

ఆ॥ చాలుకాలుకూలుసంహారవచనంబు, లోలికావ్యమందునొనరనేని
ఫాలలోచనుఁడయినభస్మమయిపోవును, బాలవార్ధిశయనబాలకృష్ణా.

End:

మ॥ స్వరవర్గద్రుతముల్ శకంధుగుణముత్వప్రాద్యభేదద్వయను
సంరభిను ప్రభుకాకునితఁములుదేశఁజోబయాఖండముల్

సరసాదేశవిభాగవృద్ధులునుమాసంయుక్తవైకల్ప్యముల్
గరిమన్బోలికచక్కటెక్కటియునంగానిర్వదేశాయతుల్.

వ॥ ఇందులో వృద్ధియతికిక్షేమేంద్రులుచెప్పినశతపక్షిసంవాదములోఁబద్యము.

సీ॥ అమలినాక్షరరూపియాద్యంతసకలలో, కైకసంస్తుత్యసురౌఘవంద్య
కమలాసనార్చితకాంతార్ధవరదేహ, కౌశికప్రియరవికైరవాప్త.

Colophon:

క॥ తనరగఁగవివాగ్బంధన, మనుఛందంబవనివెలయహర్షముఁతోఁది
క్కనసోమయాజిచెప్పెను, జనులెల్లనుతింపశాస్త్రసమ్మతిగాగన్.

S. కవివాగ్బంధనము. ఈగ్రంథమునగణస్వరూపము, గణాధిదేవతలు, గ్రంథాదిని యాగణప్రయోగమునసంభవించుకీడుమేలులు, వర్ణములు, వర్ణాధిదేవతలు, వర్ణములరంగులు, రాశ్యధిపతులు, వారిమిత్రత్వశత్రుత్వములు, యతులసంఖ్య, వానిలోవృద్ధియతియుదాహరణము మున్నగునవి ప్రతిపాదింపఁబడెను.

R. సంపూర్ణముగాదు. యతిసంఖ్య నిరూపణమాత్రముచేయఁబడెను. తప్పులు గలవు. శైథిల్యముగలదు. గ్రంథపాతముంజూపట్టు. ఈ గ్రంథమున ఁగవిజనాశ్రయమునఁగానంబడు "గగమాయెరెండుగురువులు" మున్నగుపద్యములు గొన్నిగన్పట్టెడి.

The work is incomplete.

---

## 704. కవిసర్పగారుడము.

### KAVISARPAGĀRUḌAMU.

M. 343; S—17×1⅞; L—7; ll.—7; G—196.

Beginning:

మ॥ ధరదైవంబుగృహంబుసౌమ్యుఁడుహరిద్వర్ణంబుసత్కాంతియా
సురమూహింపగణంబుజాతిదలపించున్శౌద్రిమయ్యోనిదా
కరిణంబుజ్వలతారజ్యేష్ఠరసముద్యద్రౌద్రమాకాశితే
లురుభద్రంబుభలంబునామగణమింపొందున్జనస్తుత్యమై.

యగణమునకు.

మ॥ అలదైవంబుజలంబుబ్రాహ్మ్యముకులంబా . . తల్పార్థమా
ఫలమాయోగిపవంగమాగణముచెప్పన్మానవంబాగ్రహం

బలశుక్రుంగురసంబుదాకరుణపూర్వాషాఢనక్షత్రము
మ్ములకోదండమురాశినాయగణమొప్పన్ కోవిదస్తుత్యమై.

End:

క॥ ఈరికలెత్తెమనంబున, నీరసమీరెలుగుదానమీరెయునంగా
నీరనగమిమ్ముచెప్పట, ఈరెడనరేఫలయ్యెనెయ్యెడఁగృష్ణా.

Colophon: Nil.

S. కవిసర్పగారుడము. గణములదైవములు, గణరాశిలు, గణయోనులు, గణరసములు, గణనక్షత్రములు మున్నగునవియు రేఫనిర్ణయమును జేయఁబడియె.

R. అసమగ్రము. వ్రాలుచక్కనివికావు. తప్పులుమెండు. శైథిల్యముకొద్ది. గ్రంథపాతములుగలవు. కవి తెలియదు.

The author is not traceable. The work is incomplete.

---

## 705–712. ఛందము.

### CHANDAMU.

M. 326; S—12×1½; L—125; ll—6; G—1875.

Beginning:

క॥ శ్రీకాంతాతిప్రియువా, క్ష్మాకాంతజగత్రయైకసేవితనుతవి
ద్యాకాంతనవ్యకావ్యస, దేకాంతనితాంతకాంతయాంవృతమాకా.

క॥ విద్యలలోపల + హృద్యంబుగఁగవితఛందమేర్పడఁగృష్ణా.

End:

క॥ ధరజ్యేష్ఠయుఁబూర్వాషా, ధరయుగఁగృత్తికయుస్వాతియటఁబుష్యమియుజా
ఇరవుగనుత్తరరోహిణి, గరిమన్యరసతజభనగణతారకముల్.

చ॥ పురహరుముద్దుపట్టిశశిభూషణునార్యజనానురాగిసిం
ధురవదనున్మహామహునిఁదుంబురసంస్తవనీయునంబుజో
దరహారవాసవాదులకుఁదద్దయుఁగోరికలిచ్చువేలుపున్
బరమపవిత్రునంచితకృపాపరిపూర్ణగణేశుఁగొల్చెదన్.

Colophon:

S. ఛందము. వడులు, గణములు, ప్రాసలు, వృత్తలక్షణములు చెప్పఁబడినవి.

R. సమగ్రము. వ్రాలుచక్కనివి. తప్పులులేవు. శైథిల్యగ్రంథపాఠములులేవు. గ్రంథమునదీననొకలాక్షణికుఁడు చెప్పినవిషయములుగాక పలువురుచెప్పినవి గానగును. గ్రంథకర్తృనామము తెలియదు. పత్రసంఖ్య చాలఁదాఱుమాఱుగానున్నది.

*This work is a compilation from works on prosody. Neither the name of the author nor of the work is to be found in the body of the work.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 706. | M. | 327 | 15×1⅜ | 103 | అసమగ్రము. |
| 707. | ,, | 333 | 15×1 | 30 | ,, |
| 708. | ,, | 341 | 16¼×1¼ | 6 | ,, |
| 709. | ,, | 334 | 15×1½ | 11 | ,, |
| 710. | ,, | 335 | 18×1¾ | 7 | ,, |
| 711. | ,, | 336 | 18×1½ | 37 | ,, |
| 712. | ,, | 213-b | 19½×1⅝ | 8 | ,, |

R. వివిధలక్షణగ్రంథములనుండియుఁ ప్రబంధములనుండియుఁ బద్యము లెత్తి వ్రాయఁబడినవి.

## 713. ఛందోదర్పణము.

## CHANDŌDARPAṆAMU.

B. 10017; S—16¾×1½; L—10; Il.—6; G—300.

Beginning:

శుభమస్తు.

సీ॥ ఏకవినిర్మించెనేకశబ్దశాస్త్రప, ద్ధతియెల్లఁగల్లచింతామణియన
నేకవిచెప్పననేకపుణ్యానల్ప, బంధురసంక్షేపభాగవతము
నేకవిపఠియించెనల్లభావలునతి, ప్రకటనిర్భరమతిప్రౌఢిమెరసి
యేకవితెచ్చెమహీశసంఘముచేత, వారణాశ్వాదిసువస్తుచయము

తే॥ నతఁడువెల్లంకితాతమహాకవియాగ్ర, గణ్యుఁడుత్తమసుకవిముఖ్యాధినాథు,
డంబరాశావకాశవిఖ్యాతచక్ర, వాళశైలాంతరావాప్తఖేలయశుఁడు.

క॥ ఛందోమయుసృతినుతుప్వ, ఛందోవిహాగేంద్రుగొల్చినన్మునికరుణన్
ఛందోదర్పణమనియెడు, ఛందము చెప్పెదనుసర్వజనసమ్మతిగన్.

క॥ ఛందము రెండు దెరంగుల, నందంబగుజగతిలోనన క్షరమాత్రా
సందంర్భంబై యక్షర, సందంర్భంబులనువృత్తజాతంబొప్పున్.

End:

క॥ రతభములకుంబుత్రులనన్, జతురతవిలసిల్లుచుండుసజనయలుజగ
న్నుతవీని నెఱుంగవలయును, నతులితకావ్యప్రవీణులైనమహాత్ముల్.

వ॥ కవిజనచింతామణిలోపద్యమిది. ఛందోదర్పణముసంపూర్ణము.

Colophon: Nil.

S. ఛందోదర్పణము.

R. సమగ్రము. వ్రాతచక్కనిదే. తప్పులుగలవు. శైథిల్యముకలదు. గ్రంథపాతములులేవు. ఈగ్రంథకర్త వెల్లంకి తాతంభట్టునునుతించియున్నాడు. కర్తృనామముగానరాదు.

This work is Chandōdarpaṇamu of unknown authorship. Containing, as it does, the praise of Vellaṅki Tātambhaṭṭu, this work should not be taken to be identical with Anantunichandassu, which also goes by this other name.

## 714. సర్వలక్షణసారము. (రంగయ.)

SARVALAKṢAṆASĀRAMU. (Raṅgaya.)

M. 328; S—19×1½; L—52; ll.—5; G—832.

Beginning:

సప్తగణముల......కావ్యచింతామణి తాతంభట్టు.

క॥ మగణమువలనన్ యగణము, యగణమువలనంజనించెనారగణంబా
రగణమువలనన్ సగణము, సగణంబునుదగణమునకుజనకంబయ్యెన్.

* * *

గణానాం గురులఘుసంజ్ఞా వృత్తరత్నాకరే.

శ్లో॥ ఆదిమధ్యావసానేషు * *

ఆంధ్రభాషాయాం గోకర్ణఛందసి.

క॥ మొదలనడుమంటలఘువులు, వదలవుయరతలనువానివరుస నెభజసల్
విదితంబులుగురువులుతుద, మొదలనడుమ మనల కెసఁగు మొగిగురులఘువుల్.

* * *

End :

నన్నెచోడకుమారసంభవము.

క॥ నెఱిగలిగినాడునాటికి, గుఱిగడవక జేరిజఘనకుచకచభరముల్
చిఱుదొడలునడుమునబ్బును, విఱ...నోయనుచుగిరిజ వెఱచుచునడవక.

Colophon :

క॥ అక్షరములుతప్పైనను, లక్షణమిదిగాఁగవిద్వరాదనిర్వాసెక
ఇక్ష్వోణిసురుఁడురంగయు, దక్షకవిప్రభులారదయసేయవలెక.

S. ఇదియొకఛందోగ్రంథము. ఈగ్రంథమున సప్తగణోత్పత్తి, గణాధిదేవతలు, వానిప్రయోగనియమము, అక్షరసంఖ్య, అక్షరములవర్ణములు, అమ్మాత్రాక్షరవిసాక్షరములు, అక్షరములగతులు, అక్షరములయల్పప్రాణమహాప్రాణభేదములు, పంచతత్వములు, నవరసములు, రేఫళకటరేఫములు, వానిప్రయోగవిషయము, అందులకుఁగొన్ని యుదాహరణములు అనునవి ప్రతిపాదింపఁబడెను.

R. సమగ్రము. వ్రాలుమంచివే. తప్పులుగలవు. గ్రంథపాతశైథిల్యములు లేవనరాదు. ఈగ్రంథమున వృత్తరత్నాకరము మంత్రదర్పణము నిధిప్రదీపిక చందోదర్పణము. కవిరాజగజాంకుశము మొదలగుగ్రంథము లాయాతావులఁ జేర్కొనఁబడినవి. గ్రంథనామము గ్రంథములో నెక్కడనుగానరాదు. కాని గ్రంథారంభమునకుఁబూర్వము "శుభమస్తు, సర్వలక్షణసారం" అనియున్నది. ముఖపత్రమున "ఛందస్సుసకలలక్షణసారంసాహిత్యలక్షణం" అనియున్నది.

The name of the work is howevcr not to be found in the body of the work.

## 715–716. * సులక్షణసారము. (తిమ్మకవి.)

SULAKṢAṆASĀRAMU. (Timma Kavi.)

| | | | | | |
|---|---|---|---|---|---|
| 715. | M. | 329 | $16\frac{3}{4}\times1\frac{3}{4}$ | 26 | అసమగ్రము |
| 716. | ,, | 330 | $18\frac{1}{4}\times1\frac{1}{8}$ | 20 | |

R. 716. ఈప్రతివిలేఖరి యిట్లువ్రాసియున్నాఁడు. "దుర్మతినామసంవత్సర కార్తీక బహుళ ౫ భానువారం రావేలశింగరాజుకుమారుండు భానుమంతయ వ్రాశిన సులక్షణసారం."

The scribe is Bhānumantaya, son of Rāvēla Siṅgarāzu and the date of transcription is Sunday the fifth day of the dark fortnight of the Kārthika Month in the year Durmati.

## 717. లక్షణసారము.

## LAKṢAṆASĀRAMU.

D. 10019; S—16½×1½; L—5; ll.—6–8; G—100.

Beginning:

క॥ ఒనరగమూఁడెడలను మొద, లనఘుమతుదిగదియఁగగురులఘువులు నే తెం
చినమభజసనయరతనా, మనిరూపితగణములయ్యె మహిని శ్వేశా.

End:

క॥ భువిప్రాసములకుయతులకు, నవిరళముగఁజెప్పినాఁడనాఖ్యలటునలే
గవులనవలెకాదనువా, రవివేకులువాద మేలనయ్యల్పులతోన్.

క॥ సరసులగుకవులనందరఁ, దరిచేర్చుటకొంతయుపమదలఁచిమదినిపూ
ర్వరచితలక్షణములనుంచి, సిరిలక్షణసారమనగఁజేసెద మొదలన్.

వ॥ ఇంకనథర్వణాచార్యఛందోపద్యము.

క॥ నారకొన్నది మొదలుకవి, శ్వరుఁడేకవిధంబుగానవరసములుతగన్
విరచించినట్టికృతి యది, ధరణీనత్కావ్యమనఁగఁదనరుచునుండున్.

Colophon: Nil.

S. లక్షణసారము. దీని గణస్వరూపము, గణాధిదేవతలు, ఆయాగణములస్థాన నియమము మొదలగువిషయములు చెప్పఁబడియె.

R. సమగ్రము. వ్రాఁతయొకమాదిరిది. తప్పులుగలవు. గ్రంథపాతముగలదు. శైథిల్యముగన్పట్టు. గ్రంథకర్తృనామముగానరాదు.

This work is Lakṣaṇasāramu of unknown authorship. The elements of prosody are dealt with here.

## 718. అభినయదర్పణము. (విచిత్రరాయవతంస.)

## ABHINAYADARPAṆAMU. (Vicitrarāyavatamsa.)

B. 11537; S—18$\frac{3}{10}$×1$\frac{3}{10}$; L—28; ll.—5; G—425.

Beginning:

ఉ॥ శ్రీకలకంఠకంఠికుచసీమలనొక్క కరంబుదర్పణ
శ్రీకరగండపాళినొకచెయ్యినిలంబముమీఁదనొక్క కే
లాకలకంధరాప్తినొకహస్తముసాఁచినసహస్రబాహుతా
స్వీకరణంబుగోరుహరిచెల్వుగఁ బ్రోవుతఖండోజీప్రభున్.

* * *

వ॥ అనియిష్టదేవతావందనంబునుసుకవిజనతావందనంబునుగుకవి నిందనంబునుం
గావించియొకానొకప్రబంధంబెద్దియైనరచియింపఁగోరియున్న సమయంబున.

ఉ॥ ఓజదలిర్పఁ బ్రేమముననోలగముండిహితాళితోడఖం
డోజివిచిత్రరాయఁడుమనోధృతినన్నటుపిల్వఁబంచిభా
మాజనమానచోరమధుమాసరసాలమరందసాంద్రధా
రాజయచుంచువాక్యములరమ్మనిబల్కుచుకూర్మిగుల్కఁగన్.

వ॥ తనయొద్దాసనంబుననుండ నియమించిఅంతరంగంబునదయారసతరంగంబులు
పొంగిపొరలుతెరంగులముఖపుండరీకంబు,కొండింపననునిజనామాంకితుఁజూచి
యిట్లనునభినయదర్పణంబనుమహాగ్రంథంబుతెనుఁగునమెరుంగిడిమదీయకీర్తి
ముఖాలంకారంబు సేయుమన్న వల్లెయనియే నుదదారంభముదావహ మాన
సుండనై యిట్లంటి.

సీ॥ కౌశికగోత్రరాకాచంద్రుఁడై మించి, ప్రబలఖండోజీరాయభక్తిగలిగి
పొంగుచుకృష్ణాజిగంగాజియనఁగాంచె, గురుజాయినాథునినరసవిభుని
అతనికిపుత్రుఁడై యలరువిచిత్రరా, యక్షమాసర్వమిభాగాంబయందు
నగవైరిశచియందునలజయంతునిబోలె, రమయందుహరిరతీరమణుఁబోలె

తే॥ నినుగాంచెనలసమాననిరుపమాన, దానదారా...తాంభోనిధీంద్ర
తోయకౌక్షేయమండితధోరజేయ, రాజితసుకీర్తిగేయఖండోజిరాయ.

వ॥ తదంకితంబుగానొనర్పంబూనిన యేతత్కృతిసందర్భక్రమం బెట్టిదనిన.

End:

క॥ ఎనయం బతాకగవేశయుగ, మునస్వస్తిక మొప్ప రెండుభుజములనిడి నే
ర్పునవూరుకాంతుంజూపంగ, మను హేమంతాభినయము మదగజయానా.

*   *   *

క॥ మల్లవడివరదదశది, గల్లతటీముకురమిళితకాశ్మీర
.........కరణతేజో, హల్లకవిద్వేషిమూర్తి అనుపమకీర్తి.

Colophon:

ఇది శ్రీకమలాంబికావిమలకృపాలబ్ధసాహిత్య కళావతంస సలోహితగోత్ర హేబళార్యపుత్ర దర్పకులపావనగిరిరాజకవివరానుజవిచిత్రరాయావతంసప్రణీతంబైన అభినయదర్పణంబను మహాగ్రంథంబున ద్వితీయానుబింబమన్నది సంపూర్ణం. (16-ప)

S. అభినయదర్పణము.

R. సమగ్రముగాదు. తృతీయానుబింబంబున Colophon మాత్రముగానరాదు. వ్రాంతచక్కనిది. తప్పులుగలవు. శైథిల్యమల్పము. గ్రంథపాతముంజూపట్టు.

This work is Abhinayadarpaṇamu by Vicitrarāyavatamsa, the brother of Girirāja Kavi and the son of Hebaḷārya. The colophon is not to be seen in the third Anubimba.

## 719. తాళదశాప్రాణప్రదీపిక. (గోవిందకవి.)

TĀLADAŚAPRĀṆAPRADIPIKA. (Gōvinda Kavi.)

B. 11600; S—$15\frac{1}{2}\times1\frac{8}{10}$; L—41; ll.—5; G—800.

Beginning:

శా॥ శ్రీవాణీరమణీవిబుద్ధపదరాజీవోత్తమాంగప్రభా
వావిష్కారపరిష్కృతాధరతలోదాయ.. మునా
ర్యావామాంగవిభానమానునసమానాంతర్ముఖస్వాంతప
దావాసోత్సవకావిశ్రీయుదవినాథస్వామింబ్రార్థించెదన్.

క॥ రామునిదశముఖదనుజవి, రామునిసజలాంబుదాభిరామునిసీతా
రామునివినమితభార్గవ, రామునిదితయాతుధానరామునిగొలుతున్.

* * *

వ॥ ఇట్లభీష్టదేవతాభివాదనాచరణంబునుసమస్తసుకవిరాజబహూకరణంబును

* * *

ఒక్కభరతలక్షణగ్రంథంబు బంధురాంధ్రభాషావిశేషవచనరచనా ప్రచుర
బుగారచియింపఁదలంచియుండునవసరంబున.

సీ॥ సర్వేశ్వరునియంమసంభవించిననాల్గు, జాతులలోననిచ్చలముగాఁగఁ
గలియుగంబున మీరు శూద్రజాతంబు, ప్రభగాంచెనందులోవంటకులము
ఆవంటకులములోనతులకీర్తులదాల్చి, చెఱుకూరికులమువిస్తీర్ణమగుచు
నామహాకులమలోనటపొగడ్తకు నెక్కె, పెద్దలకునుబెద్దపెద్దవిభుఁడు

తే॥ అతనియిలాలుపెద్దాంబయనగఁదనరు
నాన్నపాలునకానతికతులగుణుఁడు
పాపనయనంగనొక్కభూపాలతిలకుఁ
డుదయమయ్యెనులోకైకవిదితయశుఁడు.

క॥ అతనికిగల్గిరియేగురు, సుతులతులితభోగభాగ్యసుత్రాములుసం
తతపాతివ్రత్యార్జిత, హితకీర్తికిజీవగట్టియెఱ్ఱాంబికకున్.

మ॥ వరుసన్బెద్దవిభుండులింగన్నృపుఁడున్వారాశిగంభీరులా
తిరుకామావనినాథకృష్ణవిభులున్దీనార్తిమందారుఁడం
బరచూడాంఘ్రిసరోజపూజనకశోభవ్యుండుశ్రీరామలిం
గరమాకాంతుఁడనంగసంగతసమాఖ్యాభాగులాయేగురున్.

ఉ॥ వారలలోనముఖ్యుఁడయివంశకరుండగురామలింగభూ
మీరమణాగ్రగణ్యునకమోఘగుణాకరరామకాంబకున్
ధీరులుగల్గిరేగురుసుధీజనతావినుతాధికప్రథా
ధారులుదారశేఖరులుదాత్తగుణోత్తములుత్తమోత్తముల్.

క॥ శ్రీకరసదాశివాఖ్యమ, హీకాంతుఁడుదవినాయకేంద్రుఁడుఘనపు
ణ్యాకలితుఁడుపాపాజియు, నాకోమరపరామభద్రులనసత్పుత్రుల్.

క॥ అగ్రజుఁడువారికెల్లన, మగ్రయశోధనుండుధర్మమార్గణహృదయో
దగ్రుఁడుసదాశివనృప, తిగ్రామణియతనినన్నుతింపఁగఁదరమే.

క॥ అతఁడొక్కనాడుసపురో, హితకోవిదసుకవిబంధుహితమంత్రిసుహృ
త్తతిముఖపరిజనపరివే, ష్టితసభలోనిండుకొలువుసేయుచునొకచోన్.

ఉ॥ సన్నిధినున్ననన్నువిలసత్కరుణాస్తకటాక్షవీక్షణా
భ్యున్నతిఁజూచియిట్లనియెపాలురివంశమణీసుధారసో
ద్యన్నవమాధురీమహితహారిగభీరలసద్వచోవిహా
రోన్నతసత్కవిత్వవిభవోజ్జ్వలఓబయమంత్రినందనా.

క॥ మునుపునుపర్వతనారద, మునినాములచరితమునమున్నతఫణితిన్
ఘనకావ్యంబుగనొనరిచి, తనకిచ్చినఘనుఁడవౌగదాప్రమదమునన్.

* * కృతపూర్వసుకవి గోవిందకవి.

తే॥ బహువిధంబులయినభరతశాస్త్రంబుల, లోనముఖ్యమునుప్రధానమగుచు
నాదిభరతమునిమహానటప్రోక్తంబు, వెలయుదానియందువిస్తరిలెను.

క॥ తాళదశప్రాణంబులు, బాళిననవితెనుఁగుచేసిప్రతిపద్యమునన్
వాలాయముమాపేరను, గోలగనంకితముగలుగఁపొంకించగదే.

వ॥ అనియానతిచ్చి.

చ॥ సరసుఁడులాస్యదర్శన విశారదశారదతాళ లక్షణం
బరసెదతీయ లక్షణమునందరుమెచ్చగతద్గుణంబున
బ్బురముగదెల్పివైఖరికిబోవగరెండవమేరుధన్వియీ
భరతమువీరరాఘవయపాటిమహానటమాళికల్గునే.

వ॥ ఇట్టితాళదశప్రాణలక్షణపరీక్షాపాండిత్య * *
తాళదశప్రదీపకమ్మనుపేరనొక్కకబ్బంబొనరించిమాకంకితంబు సేయుమని
మునునిట్టిమహాకార్యంబునకునీవెసమర్థుండవుగాని యిచ్చటమరియెవ్వారును
నేతత్కార్యసమర్థులుగారనియుఁజాలఁబ్రార్థించి కర్పూరతాంబూలాదిసత్కా
రంబులచేతబహూకరించినచేకొనినేను బరమానందసందర్భితహృదయారవిం
దుండనగుచుతత్కార్యంబునకుపక్రమించెద. షష్ఠ్యంతాలు.

* * [illegible]

End:

క॥ మహీతాగమప్రచోదిత, విహితప్రథితాత్మధర్మవిదితాచరణా
ప్రహృతమలీమసతాంచ, దహోరాంభోజాతనిహితధర్మశతాంగా.

తోదకం॥ అర్జునరోధిరథావహృతిప్రా, ఘార్జునదానమహావిభవప్రా
ప్తార్జునకీర్తిమహాభరణాచా, ర్భార్జునతాతదిగాదిదిగంతా.

Colophon:

ఇది శ్రీమద్రామభద్రభద్రాయతకరుణాకటాక్షవీక్షణాతిశయసులబ్ధసారస్వత విచిత్రపోలూరిఓబయామాత్యపుత్ర సకలసజ్జనవిధేయగోవిందనామధేయ ప్రణీతంబైన తాళదశాప్రాణప్రదీపిక యనుమహాభరతకావ్యలక్షణంబుద్వితీయాశ్వాసము.

S. తాళదశాప్రాణప్రదీపిక. నాట్యశాస్త్రమునుగూర్చి చెప్పుగ్రంథము.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులుగలవు. గ్రంథపాతశైథిల్యములుగలవు.

This work is Tāḷadaśāprāṇapradīpika by Gōvinda, the son of Ōbayāmātya of the Pōlūri family. This is dedicated to king Sadāśiva.

## 720–721. తాళదశాప్రాణలక్షణము.

TĀḶADAŚĀPRĀṆALAKṢAṆAMU.

B. 11616; S—$14\frac{3}{10}\times1\frac{2}{5}$; L—39; ll.—6; G—802.

Beginning:

చ॥ శతమఖలోకవంద్యగురుసద్గతిదేరిశకుకీర్తిశర్మకు
యతిలఘుసెప్పనాశ్రితవరాస్వకుభక్తజనానుమోదక
సతతము స్తరాదిమురాంనిరిదారాపతినిఁదలంచి
లాస్యమతపద్ధతిచెప్పెదతాళమానముల్ ?

End:

వ॥ ఈవిధంబునధృతాలఘుధృతలఘుగురుధృతగురుప్లుతమ్ధృతప్లుతమ్ఇత్యాదిమాత్రలుమహత్తురగాబ్రాసుకొనేది.ఆమహత్తుక్రిందనల్పాంగంబుబ్రాసియెడమను మహత్పూర్తికిశావలసినయంగంబులుగొప్పయంగంబుమొదటబ్రాసియల్పాంగంబుపిదపబ్రాసేది.

Colophon : Nil.

S. తాళదశప్రాణలక్షణము.

R. సమగ్రముగాదు. వ్రాఁతచక్కనిది. తప్పులుగలవు. గ్రంథపాత్రశైథిల్యములు లేవు. 721 నం॥ గ్రంథారంభమునిదియునొకే విధముగానున్నది. "ఇంద శపడీతాళదశప్రాణః" అనిగ్రంథాంతముననున్నది.

This work is of unknown authorship. It is incomplete.

721. B. 11521-d $16\frac{2}{10}\times1\frac{3}{10}$ 5 గ్రంథలిపి. అసమగ్రము.

## 722–723. నాట్యవిషయము.

NĀTYAVIṢAYAMU.

M. 693; S—14×1¼; L—37; ll—6, 7; G—750.

Beginning :

శ్లో॥ అంగేనాలంబయేద్గీతం హస్తేనార్థంప్రదర్శయేత్ ।
చక్షుర్భ్యాంభావం దర్శయేద్భావం పాదాభ్యాంతాళమాదిశేత్ ॥

* * *

శ్లో॥ అగుళ్యోనికుంచితాంగుష్ఠసంస్పృష్టప్రస్సృతాయది ।
సపతాకాకరః ప్రోక్తః నృత్యకర్మవిచక్షణైః ॥

అర్థం॥ అంగుళ్యోనికుంచితాంగుష్ఠః అంటే అంగుష్ఠవేలునుముడించేది. సంస్పృష్ట ప్రస్సృతాయది, అంటే కడమవేళ్లు నిడుపుగాచూచేది. సపతాకాకరఃప్రోక్తః, అంటే, పతాకాహస్తమనఁబకును. నృత్యకర్మవిచక్షణైః, అంటే నాట్యారంభానికివచ్చుననిరొరుంగుట.

End :

శ్లో॥ ఉక్తవాక్కారయేత్తేనదేవయాగేనతర్పితః ।
దిశంతిదేవభూపానాంసర్వాభీష్టఫలంక్రియే ॥

Colophon :

ఇతినాట్యప్రశంసాసంపూర్ణం. (38-వ పత్రము.)

S. నాట్యవిషయము. దీననాట్యమునుగూర్చిచెప్పఁబడెను. ఇదిసంస్కృతనాట్యగ్రంథమునకుటీకాగ్రంథము.

R. తప్పులుగలవు. వ్రాఁతమంచిది. శైథిల్యగ్రంథపాఠములుగలవు. టీకాకర్తపేరు గానరాదు. ఈప్రతియందు మఱికొన్ని యితరభాషాగ్రంథములుగలవు. ఇది గ్రంథలిపిలోనున్నది.

This work is a commentary in Telugu upon a work in dramaturgy in Sanskrit. Neither the name of the Sanskrit work nor the name of the author of the commentary is to be found.

723. B. 11521–a $16\frac{2}{10}\times1\frac{3}{10}$ 12 గ్రంథలిపి. అసమగ్రము.

## 724–726. ఆంధ్రద్విరూపకోశము. (వెంకటపతి.)

ANDHRADVIRŪPAKOŚAMU. (Veṅkaṭapati.)

M. 350; S—16×1⅝; L—21; Il.—5; G—420.

Beginning:

క॥ శ్రీభామానన్ శ్రీకృష్ణ+వేంకటాచలవాసా.

సీ॥ సరసాశుమాధురీవిస్తరరీతియొకడి, సత్ప్రబంధనిబంధనాతిశక్తి
శతలేఖనీపద్యసంధానపటిమచిం, తాసమస్యాపూరణముత్రిపాద
సంఘటనయునిరోష్ఠ్యమ్మునోష్ఠమ్మని, చ్చాపవాక్యములునువ్యస్తాక్షరములు
నల్లట్లుహాల్ నోపనముచలజిహ్వాకా, చలజిహ్వాకలుకమ్మచదువవర్ణ

తే॥ సమితియింతనిదెల్పుప్రజ్ఞయితువదవ, ధానములునాదిగతగుచిత్రవిధములార్య
లక్షణమెఱింగిసరిలేకలక్షణకవి, యప్పఘనువెంకటపతినానలరుకవిని.

* * *

తే॥ సంధులనుదత్సమములనాశబ్దములను, నుపపదప్రత్యయమ్ములనొనరుశబ్ద
ములువిభక్తులఁగ్రియలనుగలుగుశబ్ద,ములుద్విరూపాదులగుశబ్దములనుగూర్చి.

* * *

తే॥ సరసతాంధ్రద్విరూపకోశంబునీదు, పేరఁజేశితివినుఁడుశ్రీవెంకటేశ.

End:

క॥ తివియతియగతియతివితు, తివంగాతిగియగతియ్యంగత్రివ్యస
తివగతిగియయపదియును, వివరంబుగచెలంగమిరివెంకటశౌరీ,

పాదగోపనకందము. వెలలియుదారమధురదయు

నిలుపుగుహాద్దత్తినలరునివడుభక్తిన్

కలినిఘనదేహధారి

వెలిదామరయలుగుదనరువిభుగనినహారీ.

Colophon :

యతిచ్ఛేదము॥ మహిలోపలనిది శ్రీమత్పెరుంబూదూరియతిరాజగురుకరుణాతి లబ్ధమహితాంధ్రకవనసామ్రా...ద్విరుదాంక, నందవరాన్వయార్ణవశశాంక, వాసిష్ఠగోత్రభవ్యాశ్వలాయనసూత్ర, మానదృగ్గంగమాంబాసమేత, గణవరాప్పయఖ్యాతిమజ్జనక రూపాలమేల్మంగాదయాంతరంగ శ్రీవేంకటేశాంకిత ఫణితి వెంకటపతి, రచితసర్వలక్షణశిరోరత్నకృతినిరూఢిగదలిర్చు నాంధ్రద్విరూపకోశమంతయునుదశమోల్లాసమగుచువెలయు.

S ఆంధ్రద్విరూపకోశము. శబ్దములరూపాంతరములఁ దెలియఁజేయునిఘంటువు. పదియుల్లాసములుగల్గినగ్రంథము.

R. సమగ్రము వ్రాఁతయందమైనదే. తప్పులుగలవు. శైథిల్యముగలదు. గ్రంథపాఠములు లేవు.

Veṅkaṭapati is the son of Appaghana.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 725. | M. | 351 | 19×1½ | 15 | సమగ్రము. |
| 726. | B. | 10013 | 17×1½ | 14 | ,, |

## 727–731. * ఆంధ్రనామసంగ్రహము.

(లక్ష్మణ కవి.)

ANDHRANĀMASAṄGRAHAMU. (Lakṣmaṇa Kavi.)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 727. | M. | 347 | 19×1½ | 19 | నానార్థవర్గాంతము. | అసమగ్రము. |
| 728. | ,, | 348 | 15×1½ | 18 | ,, | ,, |
| 729. | ,, | 453 | 12×1 | 30 | | ,, |
| 730. | ,, | 213-a | 19½×1⅝ | 8 | | ,, |
| 731. | B. | 11606-b | 14 8/10 × 1 1/10 | 5 | | ,, |

## 732. * దేశ్యనామార్థకోశము. (కృష్ణయామాత్య.)

DĒŚYANĀMĀRTHAKŌŚAMU. (Kṛṣṇayāmātya.)

M. 349 12×1¼ 9 అసమగ్రము.

## 733. కామందకనీతిశాస్త్రము. (జక్కరాజు వెంకట కవి.)

KĀMANDAKANITIŚĀSTRAMU. (Zakkarāzu Vēṅkaṭa Kavi.)

M. 192; S—14×¾; L—113; ll.—6; G—1712.

Beginning:

క॥ అర్జునశరదభ్రియు, శ్రీర్జునమతిలంకమల్లికార్జునవరజ
న్మోర్జితునుతియింపఁగఁదగు, నర్జునవిభులంకమల్లికార్జునవిభునిన్.

క॥ ఈరీతిపుత్రమిత్ర, శ్రీరాజితుఁడగుచురాజసేవితచరణాం
భోరుహుఁడై వెంకటధర, ణీరమణుఁడు వెలయువిజయనిత్యోదయుఁడై.

* * * *

క॥ తేంకణచోళద్రావిడ, కొంకణభూపాలదళితఘోటీపేటి
సాంకవతతికిన్ దిమ్మరయు, వేంకటజనపతికినీతివిలసితమతికిన్.

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనినకామందక నీతిశాస్త్రం
బనుమహాప్రబంధంబునకుఁగథాక్రమంబెట్టిదనిన.

శా॥ శ్రీమంత్రాధ్యుఁడువిష్ణుగుప్తుఁడువచశ్రీయుల్లసిల్లన్ ఘనం
బై మించంగనొనర్చినట్టినయశాస్త్రార్థంబుకామందకుం
డామోదంబునసంగ్రహించినయకావ్యంబై దగన్ జేసెనీ
భూమిన్ సర్వహితంబుగాబుజువుగాభూపాలయోగ్యంబుగా.

వ॥ అవ్విధంబెట్టిదనిన.

క॥ శ్రీమంతుఁడుగుణవంతుఁడు, ధీమంతుఁడునై నరాజదేవుఁడు వెలయన్
దామంతుకెక్కియాజ్ఞనె, భూమిస్థలినిత్యమార్గముననిల్పదయన్.

End:

ఉ॥ ఈగతినీతిమార్గమున నెంతయుసుస్థిరుఁడై నరాజుదా
ధీగరిమన్ వహింపుచునుదిగ్విజయంబునుసర్వసంపదల్

భోగముకల్మియుంగలిగి భూవిభు లెల్లను జేరిగొల్వను
ద్యోగము లెల్లఁ జేకురసుఖోన్నతి రాజ్యము సేయునిచ్చటన్.

ఉ॥ శ్రీరఘురామ పాదసరసీరుహ భృంగసమాన మానసో
దారమదారివీర వరదర్పవిమర్దనదుర్దమక్రియా
స్ఫారభుజాబలాధిక విసారితపూరితలోకనద్యశో
హారవిహార మానిత మహాకరివాజివిరాజితాంగనా.

*       *       *

Colophon:

గద్య॥ ఇది శ్రీమన్మదనగోపాలవరప్రసాదలబ్ధసారసారస్వత భారద్వాజ సగోత్ర జక్కరాజయజ్ఞయామాత్యపుత్రసుకవిజనవిధేయ శ్రీరామకృష్ణభక్తి వైభవ భాగధేయ వెంకటనామధేయ ప్రణీతంబైన కామందక నీతిశాస్త్రంబను మహాప్రబంధంబునందు సేనావివరంబును సేనాపతిప్రభావంబును కూటయుద్ధప్రకారంబును చతురంగబలప్రయోజనంబులును తద్భ్యాములును వ్యసనంబులును పారితోషికంబును చతురంగబలప్రశంసయు నన్నదిసర్వంబును అష్టమాశ్వాసము.

మ॥ రమణీయంబుగ శాలివాహశకవర్షంబులో వెయ్యినే
నూరును నారునై వెలయఁగాఁ బ్రౌఢిం దెనింగించిరా
రమహీంద్రమ్మయ వేంకటాద్రివిభు పేరన్ వేడ్కగామంద
కీయము శ్రీ వేంకటరామకృష్ణులు స్వభావంబొంద నారూఢిగా.

R. సమగ్రము. వ్రాతచక్కనిది. తప్పులుకొద్ది. రాజనీతినిగురించి చెప్పెడిగ్రంథము. గ్రంథపాత శైథిల్యములు కానరావు. ఈగ్రంథము 1506 శాలివాహనశకమునఁ దెనిగింపఁబడినట్లు చెప్పఁబడియున్నది. 1506 శాలివాహనశకమునకు సరియగుహూణశకము 1584 న దెనిఁగింపఁబడియె. కానిపద్యములక్షణయుక్తముకాదు.

The work was rendered into Telugu in Śaka 1506 or 1584 A. D.

This work is Kāmandakanītiśāstramu. The author seems to be Zakkarāju Veṅkaṭa from the colophon and Veṅkaṭa Rāmakṛshṇulu from the verse following the Colophon. This deals with political science and contains eight Āśvāsās.

## 734–735. * రాజనీతి (బద్దెన.)

### RĀJANĪTI. (Baddena.)

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 734. | M. | 191 | $17\frac{1}{2}\times1\frac{1}{2}$ | 10 | | సమగ్రము. |
| 735. | ,, | 37 | $10\times4$ | 28 | దేవనాగరిలిపి. | ,, |

బద్దెనీతులను పేరుతో ముద్రింపఁబడినది.

No. 735. This is a paper Manuscript.

## 736. నానావిధమంత్రములు, యంత్రములు.

### NĀNĀVIDHAMANTRĀMULU, YANTRAMULU.

B. 12279; S—$7\frac{5}{8}\times2\frac{3}{8}$; L—19; ll.—20; G—750.

Beginning:

గారుడపతయేనమః కాతెంతబుధేంత రాక్షసియంత రాక్షసియంపగుంతకుమ సూర్యునియంతా...మంత్రం మంత్రింతును, ఆమంత్రానికిదిగితేదిగితివి దిగకుంటె చంద్రునియంత మంత్రంమంత్రింతును, ఆమంత్రానికి దిగి తెదిగితివి దిగకుంటెన...సిద్ధువంటి మంత్రంమంత్రింతును, ఆమంత్రానికి దిగి తెదిగితివి దిగకుంటె పార్వతీపరమేశ్వరునివంటి మంత్రం మంత్రింతును, సర్వచాండాలి దిగుదిగు.

End:

గభవతిమంత్రం....వేదనాయ, హూంమహాకాళి, ఏకినిబాహువేదనాయ, రంరక్తలోచనిబ్రహ్మరాక్షకందాయవేదనాయ..............వేదనాయ విందేవిందే భిందిభింది మారయమారయ త్రాసయ త్రాసయ జాయతం జాయ............పరదేవతే............

Colophon: Nil.

S. మంత్రములు, యంత్రములు.

R. అసమగ్రము. వ్రాఁతరోఁత. శైథిల్యముహెచ్చు. తప్పులుకుప్పలు. గ్రంథపాతములుపెక్కులు.

## 737. నానావిధమంత్రములు, యంత్రములు.

### NĀNĀVIDHAMANTRAMULU, YANTRAMULU.

B. 12280; S—$5 \times 1\frac{3}{8}$; L—24; ll.—8; G—200.

Beginning :

...కర్పూరపరిమళాగరుధూపితాయ, ఇంద్రనీల మహానీల వజ్రవైడూర్యమరకతమాణిక్యమండన మోహన, ఆకర్షణోచ్చాలన, రిలనపరవిద్యచ్ఛేదనాయ, అనంతవాసుకితక్షకకర్కోటక శంఖపాలజయా విజయపద్మ మహాపద్మ శంఖ మహాశంఖ కీలకాయ ఛింది ఛింది రాజభయ ఉరగభయ చోరభయ వ్యాఘ్రభయ మృగభయ అగ్నిభయ.

*   *   *   *

ఆడుకాలుహనుమంతునికట్టు పిక్కభీమునికట్టు పేగులుభేతాళునికట్టు గుండెలు... వేంద్రునికట్టుతొడ...యనికట్టు.

End :

వకంవరంఆవేశ ఆవేశ.

Colophon : Nil.

S. నానావిధమంత్రములు, యంత్రములు.

R. అసమగ్రము. వ్రాంతగోంత. తప్పులుహెచ్చు. శైథిల్యముమెండు. గ్రంథపాతములుగలవు. అఱవభాషయందుఁగూడఁ గొన్నిమంత్రములుగలవు.

## 738. మంత్రములు.

### MANTRAMULU.

B. 12077; S—$8\frac{1}{4} \times 1\frac{3}{8}$; L—3; ll.—6; G—10.

Beginning :

...త్రంమింలంబుతాం....ట్టుఅలుకర అట్టుకరవదేమిభుళ్లువేదిపట్టు,...నీవు దేసువాలుకపి డొకనిముభిలుదురుపిటుకగ్నిఅనియో యిరులుయింద్రుని కట్టు నడుముకట్టు నాగేంద్రునికట్టు చనుకట్టు నాగేంద్రునికట్టు, గురునాథునికట్టు, నాలికమృత్తికట్టు, పలువరపదేవునికట్టు.

End:

అష్టదిక్పాలకులు వెరికోటనాగార్జునుఁడు రాజగడరక్షకుఁడు మాహేంద్రా గురుఁడు ఏడుగురుయిచ్చిన మంత్ర...తంత్రం అరకాలూమనస్సూ... నాచేనామంటలో,.........

Colophon: Nil.

S. మంత్రములు.

R. అసమగ్రము. వ్రాఁతయొకమాదిరిది.తప్పులుగలవు. శైథిల్యముకలదు. గ్రంథ పాతములులేవు.

## 739. శ్రీరామరహస్యము.

### SRIRĀMARAHASYAMU.

B. 12259; S—7×1¼; L—2; (65—66); ll.—5; G—15.

Beginning:

ఓం కనకవజ్రవైడూర్యముక్తాలంకృతభూషణ ఏహి ఆగచ్ఛ ఆగచ్ఛ మాకర్ణ ప్రవిశ భూతభవిష్యద్వర్తమానకాలజ్ఞాన దూరదృష్టి దూరశ్రవణం బ్రూహి బ్రూహి అగ్ని స్తంభన శత్రు స్తంభన పతమం సర్వశత్రూణాం జిహ్వాస్తంభన కురు శత్రుహానికరే శత్రుఉద్యోగవిఘ్నకరే.

End:

మంత్రదేవతయేమంటె అక్కడివార్త చెప్పును. ముందరిహేమ్యంకనిపించును. దూరదృష్టిదూరశ్రవణంకనిపించును అగ్ని. స్తంభనశత్రుస్తంభన అవును.

Colophon: Nil.

S. శ్రీరామరహస్యము. శత్రునాశనము సర్వకార్యసిద్ధియొసఁగుమహామంత్రము.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిదే. తప్పులుగలవు శైథిల్యగ్రంథపాతములులేవు.

## 740. సకలైశ్వర్యకరచక్రము.

### SAKALAIŚVARYAKARACAKRAMU.

B. 12273; S—7⅛×1¼; L—2; ll.—5; G—8.

Beginning :

క్షితౌ షట్ పంచాశత్ సమధిక పంచాశదుదకే
హుతాశేద్విషష్టి చతురధిక పంచాశదనిలే ।
ద్వివిద్విషట్ త్రింశన్మనసిచచతుష్షష్టిరితియే
మయూఖాస్తేషామప్యుపరి తవ పాదాబ్జయుగళమ్ ॥

అర్థం. క్షితౌ షట్ చతుర్యుకయుక్త చతురశ్రలుఆరు. అందుకులోగాను వృత్త మిచ్చిదళాలుయాభై.

End :

ఇదిమహాచిదంబరశ్రీచక్రం॥ సర్వత్రలోగాను, చిత్రాలకువళాలుయిచ్చేది. కరం ...సౌతులహరిజపాలనకయిచక్ర తామ్రమానవ్రాసిపూజచేసేది.

Colophon : Nil.

S. సకలైశ్వర్యకరచక్రము. ఐశ్వర్యమునుగలిగించు మంత్రములుగలవు.

R. సమగ్రము. వ్రాంతరోంత, తప్పులడక. శైథిల్యగ్రంథపాతములులేవు.

## 741. సర్పమంత్రము.

### SARPAMANTRAMU.

B. 12259-a ; S—7×1¼ ; L—3 (51–53); ll—6 ; G—15.

Beginning :

ధూళిమహేంద్రజాలి, కాలేకుండలికాలేకుండలిగర .........న...కరువరా మనిట్ట, మరుకట్టుము, తూర్పునకైలాసముకట్టుదు, దక్షిణ...ళానంకట్టుదు, పడమటకైలాసముకట్టుదు, గిరిలోనున్నపుట్టకట్టుదు.

End :

తేలుఇత్ర. సంభావావేడేయంత్రమ్.

Colophon : Nil.

S. సర్పమంత్రము.

R. అసమగ్రము. వ్రాంతరోంత. తప్పులుగలవు. గ్రంథపాతశైథిల్యములున్నవి.

## 742. జ్ఞానప్రదీపిక.

### JÑANAPRADIPIKA.

M. 435-d ; S—10×1⅜ ; L—7 ; ll.—6 ; G—108 ;

Beginning:

శ్లో॥ నిత్యానందాయశుద్ధాయ నిర్మలాయచిదాత్మనే ।
జ్ఞానోత్తమాయగురవే సాక్షిణేబ్రహ్మణేనమః ॥

వ॥ తమకిష్టదేవతయైన గురువులపాదపద్మాలకు నమస్కరించి, గురుశిష్య సంవాదమైన యీ "జ్ఞానప్రదీపిక" అనేప్రకరణము లోకోపకారార్థముగాను జెప్పెదము. తాపత్రయాలనేఅగ్నిచేత కొట్టఁబడి విరక్తుండై నిత్యానిత్యవస్తు వివేకాదిసాధనచతుష్టయసంపన్నుఁడైన యొకానొకశిష్యుఁడు శాంతుండై దాంతుండై పరమానందపరిపూర్ణుండై గురువులవద్దకుపోయివారిదివ్యశ్రీపాద పద్మములకునమస్కారములుచేసి విన్నపముచేస్తూన్నాఁడు.

End:

శ్లో॥ "శరీరమర్థంప్రాణంచశ్రీగురుభ్యోనివేదయేత్" అనియున్నదికనుకశ్రీగురునా థునినారాధించి ఆత్మవిజ్ఞానము తెలుసికొన్నవారలు దుఃఖమనే సముద్రమునుదరించి అఖండైకరసానందావాప్తినిచెందుదురు. ఇటనివేదాంతనిశ్చయము. ఈజ్ఞానప్రదీపికాప్రకరణమెవ్వఁడాయెనేమిచదివేను * * * ఈరహస్యమెవరిచేతఁదెలియఁబడునో ఆగురువులనేనుతింపుచున్నాను. ఇది జ్ఞానప్రదీపికాప్రకరణం సమాప్తమ్.

Colophon: Nil.

S. జ్ఞానప్రదీపిక. వేదాంతవిషయప్రతిపాదకగ్రంథము.

R. సమగ్రము. వ్రాఁతచక్కనిది. తప్పులుగలవు. శైథిల్యముగలదు. గ్రంథ పాతములుగూడనున్నవి. 6 వ పత్రము స్వల్పావశిష్టము. గ్రంథకర్త యెవరో తెలియదు.

This work is Jñānapradīpika of unknown authorship.

## 743. దృగ్దృశ్యవివేకటీక.

### DṚGDṚŚYAVIVĒKAṬĪKA.

B. 9916; S—9¾×1½; L—25; ll.—6; G—150.

Beginning :

శ్లో॥ కారణంకార్యజగతాం కారణార్థమనాగసమ్ ।
వారణాననమాత్మానమద్వయంసముపాస్మహే ॥

* * *

శ్లో॥ న ఖ్యాతిలాభపూజేచ్ఛా టీకాకరణకారణమ్ ।
న విద్వత్తాబలంవాత్ర ముక్తిరేవహి కారణమ్ ॥

వ॥ విద్యారణ్యమునీశ్వరులవారు దృగ్దృశ్యవివేకమని యొక్కగ్రంథముచేసినారు. ఆగ్రంథము నజ్ఞానులకు జ్ఞాన ముపదేశించుకొరకై తెనిగింపుచున్నారము.... ముదనుప్రకరణంయొక్క అర్థముల్లెను సంగ్రహించి యొక్కశ్లోకముచేతఁ జెప్పచున్నారు.

End :

సవికల్పకసమాధి, నిర్వికల్పకసమాధని సమాధి రెండువిధాలవుచున్నది. సవికల్పసమాధిన్ని దృశ్యానువిద్ధసవికల్పసమాధని, శాబ్దానువిద్ధసవికల్ప సమాధనిన్ని రెండువిధాలు. ఈచెప్పినప్రకారమునను దృశ్యానువిద్ధసవికల్ప సమాధని, శబ్దానువిద్ధసవికల్పసమాధని నిర్వకల్పసమాధని మూఁడు.

Colophon : Nil.

S. దృగ్దృశ్యవివేకటీక. వేదాంతవిషయప్రతిపాదకము.

R. అసమగ్రము. వ్రాఁతచక్కనిదే. గ్రంథపాతశైథిల్యములు లేకపోలేదు. తప్పులు గలవు. ఇదిగ్రంథలిపిలోవ్రాయఁబడియున్నది. టీకాకర్తపేరు తెలియదు.

This work, Dṛgdṛśyavivēkaṭīka by name is the Commentary on the Dṛgdṛśyavivēka of the famuos Vidyāraṇya Svāmin. The name of the author is not mentioned.

## 744. నిర్గుణపూజావిధానము.

### NIRGUṆAPŪJĀVIDHĀNAMU.

B. 11464-g; S—19$\frac{3}{10}$×1$\frac{2}{10}$; L—4 (115-118); ll.—6; G—75.

Beginning:

వ॥ శ్రీమూర్తిరూపమైనటువంటిసద్గురువుకు సాష్టాంగముగానునమస్కరించిఅడిగే ప్రకారముసకలవేదాంతాలుచదివినప్పటికిన్ని యేమయ్యాఅనుభవానకు రాదు అనిఅడిగితేగురువుచెప్పేప్రకారము: చిత్తైకాగ్ర్యముకలుగవలెను.చిత్తైకాగ్ర్య మెటువలెకలుగునంటివా, దేవతాకటాక్షముచేతకలుగవలెను. దేవతాకటాక్షమనగా నెవ్వరంటేను, బ్రహ్మావిష్ణు రుద్రాదులు దేవతలని శాస్త్రాలెల్లా చెప్పుచున్న వేలనిఅడిగెను. గురువుచెప్పేప్రకారము:కూతమట్టుపోనేరనివాఁడా మడదూరముపోయినట్టువలెనే, అనేకజన్మాలయందుభగవద్భక్తులై ఉపాసన చేసి మననశీలుఁడైనటువంటి ముఖ్యాధికారికి, మేముచెప్పిన పరమాత్మ దేవతఅయ్యా.

End:

ఆత్మకుతనకును అయిక్యముచేసుకొనేటిదేనమస్కారము. ఆత్మకును తనకును పునః అనుసంధానంచేసేటిదే ప్రదక్షిణము. ప్రపంచమంతా బ్రహ్మమయ భావనగాచూచేటిదే ఆస్థానమండపము. నిర్గుణపూజాసమాప్తిః.

Colophon: Nil.

S. నిర్గుణపూజావిధానము. వేదాంతవిషయప్రతిపాదకము.

R. సమగ్రము. వ్రాఁతమంచిదే. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములులేవు. గ్రంథకర్తృనామముగానము. ఈప్రతిలోసంస్కృతగ్రంథములుకొన్నికలవు.

This work is Nirguṇapūjāvidhānamu of unknown authorship.

---

## 745. పంచకోశవివేకము.

(అమరేశ్వరస్వామిశిష్యుఁడు.)

PAÑCAKŌŚAVIVĒKAMU. (Amarēśvarasvāmiśiṣya.)

B. 306; S—18×1¾; L—9; ll.—5; G—144.

Beginning:

వ॥ సచ్చిదానందగురుపాదారవిందాలకు సాష్టాంగంగానమస్కారముచేసి పంచకోశవివేకప్రకారముచెప్పేమనియుద్యోగముచేస్తిమి. ఇందుకధికారులెవ్వరంటే, సాధనచతుష్టయసంపత్తిగలవారు. మోక్షయిచ్ఛగలిగినటువంటివా

రికిని, నిత్యనైమిత్తికకర్మలీశ్వరార్పణంగా జేసేటువంటివారికిని సర్వదాసద్గురు సేవజేసేవారినికిని పంచకోశప్రకరణముచెప్పేము.

End :

మాయాసంసారము, తుచ్ఛమిదిరోయినిస్సారము,మాయామాయామాయ మర్మముతెలిసితే, దాయాదే నిన్నడబాయకయుండు ॥ తెలియ ॥ ఆశలేటి కిరా, దుర్జనసహవాసమేటికిరావాసిగసద్గురుదాసుఁడవై అభ్యాసముచేయక భ్రమలజెజక్కావు ॥ తెలియ ॥ * * గురుతుగనిదిగో సద్గురుండైనఅమరేశ్వరస్వామినిజేరి ॥ తెలియ ॥ శ్రీదక్షిణామూర్తయేనమః.

Colophon : Nil.

S. పంచకోశవివేకము. ఇదియొకవేదాంతగ్రంథము.

R. సంపూర్ణము. వ్రాఁతమంచిది. తప్పులుఁగలవు. శైథిల్యగ్రంథపాతములుగలవు. గ్రంథకర్త అమరేశ్వరస్వామిశిష్యుఁడు.

## 746–747. పంచతత్వజ్ఞానము.

PAÑCATATTVAJÑĀNAMU.

B. 378-a ; S—17½×1¼ ; L—13 ; ll—6 ; G—325.

Beginning :

భూమి జలము అగ్ని వాయు ఆకాశము ఈ 5 న్ను పంచభూతాలు. రోమాలు చర్మము ఎముకలు నరాలు మాంసాలు భూమియొక్క అంశము. మూత్రము వాస్నిళ్లు నేతి...రం చమట వీర్యము జలాంశము. ఆకలి నిద్ర దప్పి ఆలస్యము రతి అగ్నిఅంశము. పాగుట తిరుగుట నిలుచుట ఎగయుట ఇచ్చుట వాయు వంశము. సగ రాగము మోహము భయము లజ్జ ఆకాశాంశము. ఇదిపంచ భూతాలక్రమము.

End :

సర్వసాక్షియైనపరమాత్మ నేనేయనిచూచితే, సమాధిఅనంబడును.

ఆత్మ తానేఅవుననివేదాంతము.

అర్థము ॥ మంత్రౌషధబలముచేత పాములవాడు యెటువలెపాములలోవున్నను కరువులుపడకయున్నాడో అటువలెనేజ్ఞాని అయినవాడును ఇంద్రియముల నేటి పాములచేత కూడుకొన్నాగాని ఇంద్రియములనేటి పాములచేతకట్టుబడడు. శ్రీగురుభ్యోనమః. శ్రీః.

Colophon : Nil.

S. పంచతత్వజ్ఞానము. వేదాంతవిషయప్రతిపాదకము.

R. సంపూర్ణము. తప్పులుగలవు. గ్రంథపాతముగలదు. శైథిల్యము మెండు. వ్రాత యొకతీరునన్నది. గ్రంథకర్త్రునామమెచ్చటనుగనిపింపదు.

The name of the author is not known.

747. M. 435-c 10×1⅜ 13 సమగ్రము.

## 748. బ్రహ్మవిద్యాసుధార్ణవము. (పరమానందయతి.)

BRAHMAVIDYĀSUDHĀRṆAVAMU. (Paramānandayati.)

M. 308; S—16½×1½; L—134; ll.—6; G—3350.

Beginning :

శ్లో॥ బ్రహ్మానందంపరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం
విశ్వాతీతంగగనసదృశంతత్వమ-విలక్ష్యమ్ ।
ఏకంనిత్యంవిమలచరితంసర్వధీసాక్షిభూతం
భావాతీతంగణనరహితంసద్గురుంతంనమామి ॥

* *

వ॥ శ్రీమద్దత్తాత్రేయగురుచరణ సరోజమత్తమధుకరాయమానులై విమలతత్వార్థరహస్యవేదియైన పరమానందతీర్థులు సమస్తలోకోపకారార్థముగాను వేదాంతరహస్యగ్రంథమురచియింపనిశ్చయించి.

శ్లో॥ యావదాయుస్త్రయోవంద్యా వేదాంతోగురురీశ్వరః ।
ఆదౌబోధప్రసిద్ధ్యర్థంకృతఘ్నత్వాపనుత్తయే ॥

వ॥ అనెడిసమయము కద్దుకనకగురుదేవతానమస్కారపూర్వకముగాను.

శ్లో॥ ఆసుప్తేఆమృతేఃకాలాన్నయేద్వేదాంతచింతయా ।
దద్యాన్నావసరంకించిత్కామాదీనాంమనాగపి ॥

అనెడిశాస్త్రిలుగలుగంబట్టిన్ని ప్రాకృతముముక్షువులయొక్క సంశయనివృత్తి కొరకున్ను సకలవేదాంతసిద్ధాంతస్మృతీతిహాసపురాణాగమాదితత్వశాస్త్రిల చేతను లౌకికోక్తులచేతను శ్రీమద్దత్తాత్రేయ గురుకృపాలబ్ధస్వానుభవము వల్లను పరమానందమగ్నచిత్తుండనై యొక యనుభవగ్రంథమురచియింప నిశ్చయించితిని.

End:

వ॥ అదిఆవివేకపురుషుండు దేహాదిప్రపంచముగూడియుండగానే...ప్రపంచమున్ను లేనిదయ్యేపోవును. అదియేలాగంటే మృగజలముండగానేదబ్బర అయినట్టు

* *

ఆలింగదేహమేపర్యంతముచెడకుండునో ఆపర్యంతముజననమరణములుజీవులకుగలుగుచుండును. వివేకప్రళయునిచేతగాని లింగదేహభంగముగాదు. అపుడుగాని మోక్షములేదు. ఇదిపంచప్రళయనిర్ణయము. ఇంకప్రపంచనటనావైచిత్ర్యమేలాగంటేముముక్షుజనులకు దృష్టాంతానకానివే....

Colophon:

ఇతి శ్రీపరమహంసపరివ్రాజకాచార్యవర్య పరమానందయతికృతౌ బ్రహ్మవిద్యాసుధార్ణవే యోగశాస్త్రే పంచమప్రయోజననిరూపణంనామ త్రయోదశప్రకరణంసమాప్తమ్.

౧. బ్రహ్మవిద్యాసుధార్ణవము. 1—13 అధ్యాయములు. ఇదియొక వేదాంత గ్రంథము.

౨. సంపూర్ణముగాదు. పదుమూడధ్యాయములుగలవు.తరువాతియధ్యాయము కొంతయున్నది. తప్పులుమెండు. శైథిల్యముగలదు. గ్రంథపాతముంజూపబడెడి. వ్రాతమంచిదియనుటకువీలులేదు.

## 749. ముముక్షుజనకల్పకము.

### MUMUKṢUJANAKALPAKAMU.

I. 308-b: S—17×1¼: L.—38 · ll.—7 · G—608

Beginning :

శ్రీమతేరామానుజాయనమః.

సీ॥ అఖిలవేదాంతప్రవర్తకాచార్య, పరంపరాజన్మభూమి ?
చేతనాచేతన........, విభవాంతరాత్మార్చ వేషధారి
స్వేచ్ఛాగృహీత నిజేష్టవిగ్రహయోగి, నిఖిలహేయప్రత్యనీకకీర్తి
భోగలీలావిభూతిద్వయేశ్వరుండు, అఖిలకల్యాణగుణాకరుండు

తే॥ అతఁడుఫణిశాయిగరుడవాహనుఁడునతఁడు
అతఁడులక్ష్మీశుఁడానందమతుఁడుదానె
అతఁడుకారణకార్యాంతరాత్మయొకఁడె
ధ్యేయుఁడనిచెప్పలక్ష్మణదేశికుండు.

* * నారాయణాహ్వాయుండు అనానికిపరతంత్రులఖిల * *

End :

నారాయణమంత్రము మిగులశ్రేష్ఠము, ఈతిరుమంత్రములకును, తిరువక్షుర ములకు......పదము......డును, అదియెట్లన్నను......అనిన్ని...నారా యణాయఅనిన్ని, మూఁడుపదములైయుం......

Colophon :

ఇది ముముక్షుజనకల్పకంబను ప్రబంధంబునందు లక్ష్మణమునినై భవప్రకాశక ప్రకరణంబుచెప్పచు స్వవశీకృతాంతశ్శత్రునియమనప్రకారంబును, లక్ష్మణా ర్యావతారస్థలజ్ఞానాదిగుణ సద్భావవర్ణనంబును హితోపదేశప్రకారంబును, సదాచార్య ప్రతిపత్తిప్రకారంబును, యతీంద్రగుణసామ్యంబును, తత్స్వహితా ద్యుపదేశసమయంబున, విప్రలంభాదిదోషరాహిత్యంబును, శిష్యజ్ఞానాది నివర్తనప్రకారంబును, తదధిష్ఠితదేశాదివైభవంబును, ప్రాతికూల్యాదినివ ర్తనప్రకారంబును, తత్ప్రివణజనకృతకృత్యభావంబును, తదనుకూలప్రతికూల జనలాభాలాభకీర్తనంబును, తిరుకోవలారునిర్వహించినప్రకారంబును, త్రివి క్రమావతారప్రకారంబును, స్థలవైభవంబును, తన్నిరూపణ ప్రకారంబును, తద్దివ్యవిగ్రహవర్ణనంబును, తత్కృతోపకారవర్ణనంబును, సంతతకర్తవ్యత్వం బును, తత్కృపాపాత్రజనవైభవంబును, ఆచార్యగురుదేశికస్వామిశబ్దవాచ్య త్వంబునునన్నదిదశమప్రకరణము.

S. ముముక్షుజనకల్పకము. 1–10 అధ్యాయములు సమగ్రములు. 11 వ అధ్యాయము సమగ్రము.

R. అసమగ్రము. వ్రాంతరోంత. తప్పులుకుప్పలు. శైథిల్యముమిక్కిలి హెచ్చు. గ్రంథపాతములధికము. గ్రంథకర్తృనామముగానరాదు. "అనిలత్మజార్యుల నిరి" యనిప్రతిపద్యముచివరవచ్చుచుండును. దీన నితరులనామములు చాలఁ జేర్కొనఁబడినవి. వీనిలో కవినామమునిర్ణయింపశక్యముగాదు.

This work is Mumukṣujanakalpakamu containing the names of several authors. The eleventh Prakaraṇa is incomplete. It deals with Philosophy.

## 750–751. వివేకచింతామణి. (పరమానంద తీర్థ.)

VIVEKACINTĀMAṆI. (Paramānanda Tīrtha.)

M. 309; S—14×1¾; L—242; II.—5; G—3630.

Beginning

శ్లో॥ జగదంకురకందాయ సచ్చిదానందమూర్తయే
గళితాఖిలభేదాయ నమశ్శాంతాయ తేజసే ॥

* * *

వ॥ ఇట్లు గురుదేవతానమస్కారపూర్వకంబు మంగళాచరణంబొనరించి శ్రీమద్గురుచరణసరసిజమత్తమధుకరాయమానుండును, సకలతత్త్వార్థకోవిదుండును నగు పరమానందతీర్థనామధేయుండు సకలలోకోపకారార్థంబుగా వివేకచింతామణియను నొకశాస్త్రంబొనర్పనిశ్చయించి... సద్గురువులకు మనోవాక్కాయకర్మంబులఁగృతాంజలియైనమస్కరించి * * *
ఈ వివేకచింతామణియను యోగశాస్త్రంబు ఖండత్రయంబుగా సమర్థించి యందు ప్రథమఖండంబున మదీయాభిప్రాయంబగు చతుర్వేదమహావాక్యార్థతాత్పర్యంబగు నుపనిషదర్థప్రతిపాదకంబనంబరగు వేదాంతసిద్ధాంతంబును, ద్వితీయఖండంబున శైవసిద్ధాంతంబును, తృతీయఖండంబునబ్రహ్మాండప్రపంచ భువనకోశరచనావిచిత్రంబులునుపన్యసింపంబడియె.

End:

వ॥ ఆ సంచితకర్మంబులలోనొక్కదేహంబారంభించి భోగంబులనిచ్చెడిది। పారబ

కర్మం బకర్మంబగు నాప్రారబ్ధకర్మభోగానుభవంబునకై చేసిన పాపాదికర్మం
బులు ముందరి కార్యలక్షణమంగళాచరణంబువలన వివేకచింతామణియను
ప్రకరణంబుపరిపూర్ణంబయ్యెనిదికాలక్రమవర్ణనంబు.

ఉ॥ శ్రీమెరయంగ యోగివరసిద్ధమనోహరమైవివేకచిం
తామణినాఁగనీకృతినిధారుణిమానవులెవ్వరేనిన
త్స్రీమదలిర్పవిన్నమదిపేర్చిదురంతముల్తైనసంశయ
స్తోమములెల్లఁబాసికడుసొంపునఁగాంతురుభోగమోక్షముల్.

Colophon :

ఇతిశ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య పరమానందతీర్థ యతికృతౌ
వివేకచింతామణౌ బ్రహ్మాండప్రపంచభువనకోశవిస్తారవర్ణనం నామ తృతీయః
పరిచ్ఛేదః.

S. వివేకచింతామణి. 1—3 పరిచ్ఛేదములు.

R. సమగ్రము. వ్రాఁతయొకతీరు. తప్పులులేవు. శైథిల్యముకొద్ది. గ్రంథపాతములు
లేవు. తృతీయపరిచ్ఛేదమునఁ బత్రసంఖ్య తాఱుమాఱుగానున్నది. 242-వ
పత్రముతోనీగ్రంథముపూర్తియాయెను. 56 పత్రములలో నాద్యంతశూన్య
మగువేఱొకగ్రంథముగలదు. అయ్యదియీగ్రంథపువేఱొకప్రతిగానోపు.

This work contains three Paricchēdās.

751. M. 309-a $14 \times 1\frac{6}{8}$ 56 అసమగ్రము.

# 752—755. వివేకసారము.

## VIVĒKASĀRAMU.

M. 291-a; S—$18\frac{1}{4} \times 1\frac{1}{2}$; L—83 (175—258); ll.—4, 5; G—1500.

Beginning :

శ్లో॥ వాగీశాద్యాః+గజాననమ్ ॥

శ్లో॥ బోధానందఘనంనిరస్తసకలంకారుణ్యపూర్ణేక్షణం
మూఢానాముపదేశకంచ సతతంపాపాత్మనాంపాపహామ్ ।
వైరాగ్యంచవిరాగిణాంసుఖకరంసంపాదకంసర్వదా
శ్రీమద్దేశికవాసుదేవయతినంమూఢాత్మకోహంభజే

* * *

శ్లో॥ అనుగ్రహార్థంమర్త్యానాంసంస్కృతానధికారిణామ్ ।
వివేకసారఃశ్రోతౄణాంరచ్యతేభాషయామయా ॥

వ॥ అధ్యారోపాపవాదాలచేతనుబ్రహ్మమును నెఱుఁగవలెనని శాస్త్రమందుఁ జెప్పఁబడ్డది. కనుకనధ్యారోపమునుముందుగానిరూపిస్తున్నారము. అధ్యారోపమనంగానేదం టేనువస్తువుయందు నావస్తువుయొక్క ఆరోపము. అదెటువలెనంటేనుదృష్టాంతపూర్వకముగానునిరూపింపుచున్నారము.

End :

వ॥ ఈప్రకారాననువిచారించి ఆత్మస్వరూపమేనేనని యెవఁడెఱుంగుచున్నాఁడో వాఁడే సర్వసంసారమువల్లనుండిన్ని విడువంబడ్డవాఁడు వాఁడే కృతకృత్యుఁడు. వాఁడేపరబ్రహ్మమని సకలశ్రుతిస్మృతి పురాణేతిహాసాగమాభి యుక్తాచార్య వచనాలుఘోషింపుచున్నవి. ఈయర్థమందుసంశయములేదు. సిద్ధము.

శ్లో॥ భూతభౌతికభావేషుస్వకార్యేషుసదాత్మనా ।

* * *

ప్రమాదాదప్రమాదాద్వాయదజ్ఞానాస్మయోదితమ్ ।
తదర్థంతుసమాలోక్యపండితాస్సమదర్శినః ॥

Colophon : Nil.

S. వివేకసారము. 1–12 వర్ణకములు వేదాంతవిషయప్రతిపాదకములు.

R. సమగ్రము. వ్రాఁతమిక్కిలియందమైనదే. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములులేవు. కవినామముతెలియదు.

This work is Vivēkasāramu of unknown authorship. Vāsudēvayati is said to be the author's preceptor.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 753. | M. | 292 | $17\frac{1}{2}\times1\frac{1}{2}$ | 69 | సమగ్రము. |
| 754. | ,, | 314 | $17\times1\frac{1}{2}$ | 76 | అసమగ్రము. |
| 755. | ,, | 303 | $16\times1\frac{1}{4}$ | 38 | ,, |

R. 753. తుదిని "ద్వాదశవర్ణకముసమాప్తము" అనికలదు. ఇందుమఱియు 1 అజ్ఞానప్రకరణము. 2 జ్ఞానప్రకరణము. 3 శరీరత్రయప్రకరణము. 4 ఆత్మానాత్మవివేకము. 5 మహావాక్యార్థము. 6 వేదాంతసారము. 7 ప్రళయప్రకరణము. 8 ఆత్మబోధప్రకరణము మున్నగు వేదాంతమునకు సంబంధించువిషయములు తెనుఁగుభాషలోవ్రాయఁబడినవి.

## 756. సులభాజనకసంవాదము.

### SULABHĀJANAKASAMVĀDAMU.

M. 379; S— ; L—12; ll.—5; G—322.

Beginning:

వ॥ ....................కర్మధ్వజుండగు జనకన్నృపాలుండు వైరాగ్యనిష్ఠుండై
మోక్షశాస్త్రపరిజ్ఞానంబున మెలంగుచు నిజసాధువృత్తంబు దెలిసి వేదవిదు
లయినభూసురోత్తములు.......................................
నంబుగావించుచుండు సమయంబునఁ ద్రేతాయుగంబునందు యోగమార్గం
బెఱింగినసులభయనునొక్క కాంతామణిలోకంబునజనకుండు మోక్షశాస్త్ర
పరిజ్ఞానంబునందధికుండని విన్యాసధర్మనిరతులగువారలు కొనియాడుచుండ
గానాకర్ణించి యిదినిశ్చయంబవునో కాదోయని తెలియుటకునై.

End:

మనోనిగ్రహంబుఁ జేయనేరనియతండు శాంతింజెందఁజాలఁడు. కావునశూన్యం
బగు పరాగారంబున నొకరేయి భిక్షుకుండువసియించు చందంబుననిన్నగరం
బునందొకరాత్రి వాసంబుచేసియర్ఘ్యాసనంబున నీదు సూనృతవాక్యంబులచేత
నాతిథ్యంబుగైకొని సుఖంబున నిచ్చటనిద్రించియెల్లి సూర్యోదయసమయం
బున నిచ్చోటికేనియఁజనియెదనని యాసులభవచియించిన హేతుయుక్తం
బులునునర్థసహితంబులునునగు వాక్యంబులు జనకుండాకర్ణించి సంతసంబునం
బొదలుచుప్రత్యుత్తరంబునుడువనేరక యూరకుండెనని.

Colophon: Nil.

S. సులభాజనకసంవాదము. మహాభారతాంతర్గతంబు.

R. సంపూర్ణముగాదు. తప్పులు లేవు. వ్రాలుచక్కనివి. గ్రంథపాతములేదు. శైథి
ల్యముస్వల్పము. గ్రంథకర్తృనామము తెలియదు.

This is a story from the Mahābhārata. The author's name is not to be found.

## 757. తాళకాదిశుద్ధి.

### TĀLAKĀDIŚUDDHI.

B. 10308; S—$15\frac{1}{2} \times 1\frac{3}{8}$; L—8 (19–27); ll—5–6; G—100.

Beginning :

వ॥ తమలపాకులరసము కాకరాకురసము నేలతాటిగెడ్డలరసము దొండాకురసము దుష్టుపాకురసము మోడుక చెక్కరసము చిత్రమూలపు వేరుచెక్కరసము ఊడుగవేళ్ల చెక్కరసము రేలవేళ్లు ఉమ్మెత్త గుంటకలగరాకు గలిజేరాకు ఈచెప్పినవసర్ల చేతనొక్కొక్క పసరున ౨ సి ఘడియలుమర్దనచేసినద్రావక ముగానుమరిగించేది. ఆరసముశుద్ధిఅవును. అవుషధాలకుకూర్చుకునేది. తాళక శుద్ధి. అథ తాళకరసశుద్ధిః.

End :

లోహశుద్ధి.

శ్లో॥ లోహశుద్ధ్యథవక్ష్యంతే శాస్త్రభైషజ్యసమ్మతాః ।
సూక్ష్మచూర్ణే కృతంచైవతిలతైలేనవాపచేత్ ॥
తతో .......................రత్వాద్రవేరసః ।
పాచ్యతీవ్రాతపేక్షిప్త్వాలోహశుద్ధిర్భవిష్యతి ॥

టీ॥ లోహముపొడిగావించి ఆ పొడినూనెలో......నీళ్లకడిగితుమ్మచెక్కరసాన తిరుగావండేది. అందులోజాముప్రొద్దువుండనిస్తేనుశుద్ధిఅవును.

Colophon : Nil.

S. తాళకాదిద్రవ్యశుద్ధి యీగ్రంథ ప్రతిపాద్యము.

R. అసమగ్రము. వ్రాతమంచిదే. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతములు మెండు. ఈవైద్యగ్రంథములకు గ్రంథనామములుగాని కర్తృనామములు గాని గనుపట్టుటలేదు. ఇదియొకసంస్కృతవైద్యగ్రంథమునకు టీకాగ్రంథము.

## 758. నాడీవిజ్ఞానము.

### NĀḌIVIJÑĀNAMU.

B. 10801-a ; S—12×1$\frac{2}{10}$ ; L—6 (16–22) ; ll.—5 ; G—120.

Beginning :

శ్లో॥ శ్రీనాథంపార్వతీనాథంవాణీనాథంసరస్వతీమ్ ।
దుర్గాంవటుకహేరంబంనతతంప్రణమామ్యహమ్ ॥

శ్లో॥ నాభేరధస్తుదో పాంత్తు అక్కురాయత్రనిర్గతాః ।
ద్విసప్తతిసహస్రాణి . దేహమధ్యేవ్యవస్థితాః ॥

వ॥ నాభికిందను ఆనాభిచక్రముమీాదనున్న మొలకలు మొలచి మొనలేర్పడి డెభై రెండువేలనాళ్లు దేహమందుండును.

End :

శ్లో॥ వర్షాకాలగుణోనిశాంతిసమయే జ్ఞేయోభిషజాంక్రమాత్ ॥

Colophon : Nil.

S. నాడీవిజ్ఞానము.

R. సమగ్రము. వ్రాంతయందమైనదే. తప్పులుగలవు. శైథిల్యముగలదు. గ్రంథపాతములులేవు. గ్రంథకర్తృనామములుగానరావు. సంస్కృతశ్లోకములకుంగొన్నిటికి టీక యిందుగానవగు.

## 759. నానావిధవైద్యము.

## NANAVIDHAVAIDYAMU.

B. 10809; S—$15\frac{3}{10}\times1\frac{3}{10}$; L—112; ll.—5-7; G—1200.

Beginning :

వ॥ చిత్రమూలపువేరుపట్టనూరి ముందునిమ్మకాయంత మంచిబెల్లము నిమ్మకాయంత...నూనె అరపడెడులో వేసికలిపిపోయిమీాదపట్టి మంటవేసేది. రెండుపొంగులువస్తేదించేది. గంటెడ్డేసి లోనికిపుచ్చుకొనేది. వాడిశిబిల్లలు కరగిపోవును. పథ్యము వుప్పుపులుసువర్జితము.

End :

లఘుద్రాక్షాదిచూర్ణము.

శ్లో॥ ద్రాక్షామధూకమధుకం పిప్పలీశాలిబాంబుదైః ।
ఖర్జూరచందనోశీరైః * *

శ్లో॥ కామిలాయాంప్రమేహంచ శైత్యజ్వరవినాశనమ్ । * * *

వ॥ మిరియాలు అరపలం నల్లమేకపాలు అరశేరు నూరి.........

Colophon : Nil.

S. నానావిధవైద్యము. ఇది సంస్కృతవైద్యగ్రంథమునకు టీక.

R. అసమగ్రము. వ్రాంతబాగు. తప్పులుగలవు. గ్రంథపాతశైథిల్యములుగలవు.

## 760. మూలికాప్రయోగము.

MŪLIKĀPRAYŌGAMU.

B. 10816; S—$8\frac{2}{10}\times1\frac{9}{10}$; L—119; ll.—3; G—4680.

Beginning:

వ॥ కుసుమకుమందు పల్లేరుముండ్లు నిమ్మకాయంత.........కుసుమమానును.
* * (18-ప) వాకుడుగింజలు నేతితోనూరి, గుళికెలుచేసిగుంట గలజేరువేరున్ను కాకరాకుపసరున్ను చలువమిరియాలున్ను కూడా నేతితో సేవింప నుబ్బసముకాశలుమానును.

End:

వెక్కిళ్లు వెత్తుటసంతాపం యిందులకుకషాయం పిల్లపెసరువేళ్లు చిట్టాముట్టి పేరాముట్టితుంగముస్తెలు కురివేరుదుంపలు తిప్పతీగె జీలకర్ర యెద్దునాలికె వేళ్లు కోష్టం శ్రీగంధం శొంఠి పట్టువేళ్లు ఇదికషాయముపెట్టేను పైత్యజ్వరాలు మానును. * * మాడయెత్తుమాధిపలాలు రెండుమాడల యెత్తురసాననూరేది.

Colophon: Nil.

S. మూలికాప్రయోగము. ఈగ్రంథమున నాయామూలికల యుపయోగపద్ధతి నిరూపింపఁబడెను.

R. అసమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులుగలవు. గ్రంథపాత్ర శైథిల్యములు చూపట్టు.

## 761. రసప్రయోగములు.

RASAPRAYOGAMULU.

B. 83; S—9×1; L—22; ll.—3; G—120.

Beginning:

వ॥ వండిఆనెయ్యిఆరేసిబిందువులునస్యముచేయశిరోరోగాలుమానును. యాలకు
కల్లు...మణిశిల శిలాజితు పిప్పళ్లు ఇవిపొడిచేసిపసికడుగుగాని బెల్లముతోగాని ఇయ్యను మూత్రకృచ్ఛ్రాలుమానును. అరళ్యాదిబెట్టి నూనెనువండగాను సైంధవలవణము శొంఠి పిప్పలిమిరియాలు వగకుమాడయెత్తు వేసివండి నస్యముచేయశిరోరోగముమానును,

End:

గారీపాషాణమభ్రించవిషంమణిశిలావిషమ్ ।

తంతి.........యోద్వివసద్వయం......పత్రరస్సైఃపుటె ॥

టీక॥ గారీపాషాణము అభ్రకము వత్సనాభము.

Colophon: Nil.

S. అతిసారకషాయము వాతజ్వరకషాయము అజీర్ణజ్వరకషాయము వాతపిత్త శ్లేష్మజ్వరకషాయములు భూతభైరవరసము నారాయణరసము త్రివిక్రమరసముమున్నగుకషాయరసప్రయోగము లిందుగలవు.

R. అసమగ్రము. వ్రాఁతచక్కనిదే. తప్పులుగలవు. శైథిల్యగ్రంథపాతము లధికములు. గ్రంథకర్తృనామముగానరాదు.

## 762. రసవాదప్రక్రియ.

## RASAVĀDAPRAKRIYA.

M. 52; S—8×1$\frac{4}{10}$; L—6; ll—5; G—50.

Beginning:

వ॥ మంచిఉప్పు పేట్లుప్పున్ను, ఇందుప్పు చింతపండు అంతుకూడ ఇదల్లాఆమ్లజలం విడిచినూరిముద్దచేసి, అముద్దనుప్రమితలోఉంచి మీఁదప్రమితమూసి మన్ను రాసి కుక్కుటపుటమువేసేది. వేస్తేభస్మమౌను. ఆభస్మమును సగముయెత్తి పెట్టి సగముభస్మమును పింగానిలోపెట్టి మంచులోపెట్టితే జలముస్రవించును. ఆజలముకుప్పెలోవేసి పదిలముచేసేది. ఆనీళ్లున్ను పటికి పేట్లుప్పు రెండున్ను రెండువేసలలో ఉంచి ఆనీళ్లుపోసి మూఁడునాళ్లుయెండలోఉంచియెండించి.

End:

నాలుగుజాములుమంటపెట్టేది......తుసిందూరంవేసికరిగేదిఆవెండిని బంగారునుసమభాగము............

Colophon: Nil.

S. రసవాదప్రక్రియ. దీనవెండిబంగారమువగయిూరాలు చేయువిధము ప్రతిపాదింపఁబడియెను.

R. అసమగ్రము. వ్రాఁతమంచిది. తప్పులుకప్పలు. గ్రంథపాతముమెండు. శైథిల్యమధికము. ఇది దేవనాగరిలిపిలోనున్నది.

## 763. రోగచికిత్సాస్థానము.

ROGACIKITSĀSTHĀNAMU.

B. 10822; S—$18\frac{7}{10}\times1\frac{4}{10}$; L—29; ll.—6-9; G—350.

**Beginning:**

వ॥ భస్మమాను అదికండ్లకు పెసరుబేడంత వేసేది. గోరుపుడుకండ్లు నేత్రదాహము ది.........కంటిపువులు అయిరెలుకోడిరెప్పలు పసిబిడ్డనేత్రరోగాలు యివి మానును.

**End:**

గంటుశోణితవాతానికి.

వ॥ పిప్పళ్లు మిరియాలు ఇంగువ పసుపు యిదివగకుగగ—యిదిపొడిచేసి యెఱ్ఱ పదను......కాచిదించి లోపలికియిచ్చేది దిన శూలగంట్లు విపృతివాడిసె శోణితవాతం...మూణిగిందుమానును. చెందుపులుసుకాగాదు. నేత్రరోగాలు.

Colophon: Nil.

S. రోగచికిత్సాస్థానము. భస్మములు చూర్ణములు లేహ్యములు అంజనములు మొదలగుమందులను జేయుపద్ధతులు వానిచేమానురోగములుగలవు.

R. అసమగ్రము. వ్రాతయొకమాదిరిది శైథిల్యముహెచ్చు. గ్రంథపాతమల్పము. గ్రంథతత్కర్తృనామములుగానరావు. ముఖపత్రమున "నానావిధవైద్యము" అనియున్నది.

## 764. రోగచికిత్సాస్థానము.

ROGACIKITSĀSTHĀNAMU.

B. 10821; S— ; L—13; ll.—6; G—150.

**Beginning:**

వ॥ విప్రతికిఆవునేయిమాహాణీవజ్రసలవారు......తెల్లగిలుకలువేరు దొండవేరు మదనగడ్డివేరు ములువెంపలివేరు......గవేరు నీలివేరు ఇదివగకుపలాలు ౨ తెచ్చిపైపట్టదీసిఆనేతిలోవేసి శొంఠి పిప్పలి మిరియాలు వోమం వెల్లుల్లిగడ్డలు యిది ౫ పలాలు ఇంగువ గగ ౧ వాయువిళంగాలు కరక్కాయలు సైంధవలవణముచిత్రమూలము చవ్యము కొష్టము నల్లజీలకఱ్ఱ ఇది...లయకొట్టి నేతి

లో వేసి కాంచివడుచుకొ నేది. ఇది రేపుమాపును...చేది. యిందున గర్భవి ప్రతివోడు విప్రతి యివిమానును.

End:

అష్టాదశవిషాలు.

వ॥ తిమిరం పటలంకాశం రణశుక్లం శొలకాలుమానును. ఇదిగకుడంజనంనస్యం ఎఱ్ఱబీరవిత్తులు మిరియాలు వత్సనాభము. ఇదినిమ్మపులుసున నస్యంచేస్తే దోషజ్వరాదులువిడుచును. ఇదికాశీశ్వరాంజనము.

Colophon: Nil.

S. రోగచికిత్సాస్థానము. చూర్ణ లేహ్య అంజనాదులతయారుచేయువిధము. అవిమాన్ప్రరోగములుకలవు.

R. అసమగ్రము. వ్రాతయొకమాదిరి. తప్పులుగలవు. శైథిల్యము హెచ్చు. గ్రంథపాతములుగలవు

## 765. వైద్యచింతామణి. (సటీక.) (యల్లుభట్ట.)

VAIDYACINTĀMAṆI (SATIKA.) (Ellubhaṭṭa.)

B. 10771; S—$14\frac{1}{10}\times1\frac{4}{10}$; L—56; ll. 6—8; G—1450.

Beginning:

శ్లో॥ వాగీశాద్యాః+గజాననమ్. * * *

శ్లో॥ శ్రీవత్సగోత్రతిలకో జగద్వైద్యోపితామహః ।
కూచినార్యాసభట్టస్య ప్రియసూనుర్గుణోత్తమః ॥

శ్లో॥ తస్యపుత్రేణమహతా విపమాతాచయష్టినా ।
యల్లుభట్టేనరచితంజనానాంహితకామ్యయా ।
వైద్యచింతామణిర్నామ భైషజ్యగ్రంథముత్తమమ్ ॥

టీక॥ ఇవ్విధంబుననిష్టదేవతాప్రార్థనంజేసి శ్రీవత్సగోత్రతిలకుండును జగమందుల గలసకలవైద్యులకున్ను తాతయును కూచిపండితులకు ప్రియకుమారుండును నయినయల్లుభట్లచేతను భూలోకోపకారార్థముగాను వైద్యశాస్త్రంబునంగల సకలోత్తమసంగ్రహంబున వైద్యచింతామణియనియెడు పేరుగల శాస్త్రంబును జెప్పంబడెను.

